శ్రీ

# గండికోట పతనము.

(ఐదంకముల నాటకము.)



గ్రంథకర్త:

కలవటాల జయరామారావు.

శ్రీ

# గండికోటపతనము.



అయిదంకముల నాటకము.

గ్రంథకర్త:

కలియుగదర్పణము, తుకారాం, ప్రాణసంరక్షణ,

మున్నగు నాటకములు రచించిన,

కలవటాల జయరామారావు.







ప్రకాశకులు:

జనోపకారి ప్రెస్సు,

ప్రొద్దుటూరు



[వెల 0-12-0.

# ఇందువచ్చు పాత్రములు.

తిరుమలరాజు—రామరాజు సోదరుఁడు. (కథానాయకుఁడు)

సదాశివరాయులు—శ్రీకృష్ణదేవరాయల సోదరుఁడు.

తిమ్మానాయుఁడు—గండికోట సామంతప్రభువు.

కృష్ణప్పనాయుఁడు—మైసూరు ,,

తిమ్మప్పనాయుఁడు—సిద్ధవటం ,,

ఆదెప్పనాయుఁడు—గుత్తి ,,

కుమారదాసు—రాయబారి & దివాను.

సుదర్శననాయుఁడు—వర్తావహుఁడు.

సీతారాముఁడు—సేవకుఁడు.

శ్రీరంగరాజు }
వీరవేంకటపతిరాజు } తిరుమలరాజు పుత్రులు.

(మహమ్మద్ కులీ) కుతుబ్ శాహా—గోలకొండసుల్తాను.

ఆడిల్ షా—బిజాపూరుసుల్తాను.

మీర్ జుమ్లా—గోలుకొండసేనాని. (మంత్రి)

గులామ్ మహమ్మద్—సేవకుఁడు.

నూర్ ఖాన్ }
అలాసాబ్ } ఫకీర్లు.

సుబ్బోజి }
సిద్దోజి } కథ చెప్పువారు.

రాముఁడు—బుడబుక్కలవాఁడు.

సింగడు }
అంకడు } భిచ్చగాండ్రు.

## స్త్రీలు.

వేంగమాంబ—తిరుమలరాజు భార్య.

గులాబ్ మహల్—మీర్ జుమ్లా భార్య (కథానాయకి)



శ్రీరస్తు.

# గండికోటపతనము.

ప్రవేశము:—సూత్రధారుఁడు.

## నాంది



శార్దూలవిక్రీడితవృత్తము.

శ్రీవిద్యానగరంబుఁగట్టి ప్రజలన్
క్షేమంబుగా నేలి, కా
శీవిశ్వేశుని సేవఁ జేసి, పురినిన్
జేరంగ నేతెంచుచోఁ
ద్రోవన్ గాంచియు "బుక్కరాయ" యనుజుల్
తోడించి? బింబాంబున్,
దేవస్థానము "గండికోట" పురిలో
దివ్యంబుగాఁ గట్టి, యా
భూవంద్యుండగు "మాధవున్" నిలిపి; రా
పూజ్యుండై మిమ్మోనుతన్.

# భారతమాతృస్తవము.



జయమగు జయమగు భారతమాయీ! పావని భారతమాతా!

సర్వదేశములు, సర్వజలనిధుల్, సర్వవాహినులునూ

హిందు, ముసల్మాన్, క్రైస్తవ, సిక్కు, జైన, పారసికులూ

తమశుభనామస్మరణా, సలుపుచునుండీ మాతా!

మంగళమగునూ మాయీ!

శుభమగు శుభమగు సూనృతవాణీ! జననీ! భారతమాతా

జయమా జయమా జయమా — జయము జయము జయమా.

భారతమాతాకిజై!

(పుష్పాంజలి సమర్పించి నిష్క్రమించురు.)

ఇది ప్రస్తావన.



శ్రీ రస్తు.

# గండికోట పతనము

---

## ప్రథమాంకము.

(ప్రథమ రంగము.)

---

ప్రవేశము:—తిరుమలరాజు తాళికోట యుద్ధానంతరమున, విద్యానగర దుర్గ బహిర్భాగమున రక్తాంబర ధారియు,కృపాణ హస్తుఁడును, దుఃఖక్రోధాన్వితుఁడునునై యేతెంచును.

తిరు:—సీ॥ బిజపూరు సేనలఁ ♦ బిండి గావించియు
శమనపురికిఁ బంపఁ ♦ జాలి నాఁడ
బేదర్ బరీద్ శాహ ♦ పేర్గాంచఁ దెచ్చిన
కుంజర యూథముల్ ♦ గూల్చి నాఁడ
హుసేన్ నిజాంశాహ ♦ యుద్ధభూమిని వీడి
పరుగిడు నట్లుగాఁ ♦ దఱిమి నాఁడ
గోలుకొండ నవాబు ♦ గుఱ్ఱపు దళమును
గుట్టలుఁ బడునట్లుఁ ♦ గూల్చి నాఁడ
తే.గీ॥ యుద్ధ భూమినిఁ జొచ్చియు ♦ యోధ వరులఁ
జంపి చెండాడి చావక ♦ సిగ్గుమాలి

అన్నయగు "రామరాజు"ను ♦ నసికి నొసఁగి
అకట! యేరీతిఁ దిరుగుదీ ♦ యవని నేను.

ఓరా! నేఁటికి విజయనగరరాజ్య భాస్కరుఁడస్తమిం
చుట దటస్థించెను గదా? పదునైదవ శతాబ్దమున హరిహర
బుక్కరాయ మహాపురుషవరేణ్యులచే నిర్మింపఁ బడి పూర్వ
దక్షిణ దిగ్విజయ దండయాత్రలఁ గావించి, నరపాలుర గర్వ
మడంచి పాదాక్రాంతులుగా నొనరించి, మ్లేచ్ఛులఁ దల శెత్త
కుండ నణఁగఁ ద్రొక్కి ఆంధ్రభోజుఁడను సత్కీర్తి వహించి
న శ్రీకృష్ణరాయల వారిచేఁ బాలింపఁబడి, విద్యా సంపదల
యందుఁ బ్రపంచమున నీడు లేనిదని పశ్చిమ పూర్వ ఖండ
వాసుల చేత వేనోళ్లఁ బొగడఁ బడి, ఘూరాగ్రేనర చక్రవర్తుల
కునికిపట్టై, తురుష్క చక్రవర్తులకుఁ బ్రక్కలోని బల్లెమై, క
డకు తురకలచేఁ బడి నాశనమైన యీ విజయనగరరాజ్యము
ను జూచి నే సహింపఁ గలనా. మూఁడు శతాబ్దములు ముల్లో
కములచేఁ బొగడ్తఁ గాంచిన విజయనగర సామ్రాజ్యమా నీ
కప్పుడె పూర్ణాయువు నిండెనా! అప్పుడె యిహలోక సౌఖ్య
. ములపై విరక్తి జనించెనా! మా యన్న రామరాజు రణభూమి
నిఁ బడినందున నీకిఁ కష్టములు ప్రాప్తించు దినములు వచ్చెన
ని భీతిల్లెదవా. భీతిల్లకుము. మదీయ సోదరుండీల్గినంత నె ప్రపం
చ మంతయుఁ గ్రుంగిన దనియు, విజయనగరరాజ్యము గొ
డ్డు వోయిన దనియు భావించి వెఱువకుము. విద్యానగరభా
గ్యవిధాతా!

సీ॥ తురక యోధులఁ బట్టి ♦ దొర్లించి ఖండించు
  సేనాది గుంపులే ♦ యెదుగుచుండ
నెదురేగి మ్లేచ్ఛుల యెదలను జించెడు
  రెడ్డి వీరులు చాల ♦ రేఁగు చుండ
మ్లేచ్ఛ నవాబుల ♦ మేనులఁ జెండాడు
  ముత్తరాచపు వారు ♦ మ్రోల నుండ
గోహంతకులఁ బట్టి ♦ గొంతులఁ గోసెడు
  బోయలు నూఱూరఁ ♦ బొదలు చుండ
తే॥ గీ॥ తురక రక్తముఁ గ్రోలెడు ♦ నెలుక లుండ
  నెదుటఁ''దిరుమలరాయఁడే ♦ యిపుడు నుండ
  భీతి నీకేల పూర్వపు ♦ విజయ మబ్బ
  ''విజయనగరమా!'' నీవింక ♦ వెఱవ నేల?

అన్నదీయ సోదరుఁడు రామరాజు(దుఃఖము నభినయించుచు) అకటా! రామరాయల నామము నుచ్చరించిన తోడనె నయనముల నుండి దుఃఖాశ్రువులు వెలువడు చున్నవి గదా? అన్నా! రామరాజా! నే నింకెవరిని అన్నాయని పిలువఁ గలను? బాల్యము నుండియు గారాబముతో నాదరించి నీయంత వానిం జేసి, నా బాహుబల పరాక్రమములఁ గన్నులారఁ గాంచ నైనఁ గాంచక వీరస్వర్గము నలంకరించితివా? బహమనీ సుల్తాను దుష్ట చతుష్టయమును దిద్దిమ్మని జంత్రపు బొమ్మల మాడ్కి నాట్య మాడించిన రామభూపాలా! నీ కిప్పుడు శతివక్షములు నిండెనా. హిందూ యువతీమణుల మానభంగముఁ

గావించిన మ్లేచ్ఛాధములఁ జంపి చెండాడి హిందూ యువతీవతంసములు సహితము తమ స్త్రీలవంటి శీలముఁ గల వారని మనంబున నెంచు నటులను. దాను పరభామల బరాభవించిన తమ వనితలఁ గూడ నితరు లటులనె గావింతురని తెలిసికొను నటులను, మహమ్మదీయ మత్తకాశినుల మునుగులఁ దీయించిన మూర్తివంతా! రణరంగమున వెనుకంజ వేయని రణధీరా! తురుష్క ప్రార్థనాలయములఁ దురంగములఁ గట్టించిన ధీరవరేణ్యా! భగవదాలయముల భగ్నముఁ గావించిన మహమ్మదీయుల మసీదులను మంటఁ గలిపిన మహా వీరాగ్రేసరా! శరణన్న పగతుల నాదరించి నీ పుత్రులుగా భావించి మన్నించిన శరణాగతరక్షణబిరుదాంకితా! పర భామల యెడ మాతృ భావముఁ జూపు పరమ భాగవతోత్తమా! చంద్రధ్వజులఁ జక్కాడిన నీ దీర్ఘనిశిత కృపాణ మీ పాపపుఁ దాశికోట యుద్ధమునఁ బనిఁ జేయక దిరుగఁ బడెనా. విజయనగర నృపాలకుల హృదయ సీమ నలంకరించి యున్న జయలక్ష్మి నేఁటికి నిస్స్వశి గోమాంస భక్షకుల పాదములఁ బట్టెనా? గోముఖ వ్యాఘ్రములగు తురుష్కాధముల మోసకృత్యములకు లొంగి యూరక రణరంగమునఁ బోరకుంటివా! తెల్లని వన్నియ క్షీరము లనియు నల్లని వన్నియ జలంబు లనియు నమ్మి మోసపోయితివి గాని, లేకున్న నిన్ను జయించుటకు సామాన్యుల కలవి యగునా? నిన్ను జెనకుట త్రాచు బామును జెనకుట గదా? నీపైఁ గత్తిఁ గట్టుటఁ గౌరవితోఁ దలఁ గో

కొనుట గదా? నిన్నదుర్గానుట పులినోటఁ బల నిడుట గదా? అయ్యో! అంతటి ధీరాగ్రేసర చక్రవర్తి కంఠము కడకుఁ గఱకుఁ దురకల నీచ కృపాణమున కొఱయయ్యెఁ గదా? అకటకటా! అద్దురాత్ములు కడసారిదైన రామరాజు సుముఖమును వీక్షింప నీయక తలఁ దఱిగించి కొనిపోయిరే. అయ్యో! ఆమహానుభావుని రూప మింకఁ గాంచెడి భాగ్యము నాకుఁ గలదా. (ఆకసము వంకఁ జూడ్కుల నిగిడించి) ఏమిది. మా యన్న రామరాజు దివి నుండి నన్నుఁ జూచి నవ్వుచున్నాడు. మీసము దిద్దు చున్నాడు. తూ యని యుమియు చున్నాడు. అన్నా! నాతో నొక మాటాడి పోఁగూడదా? విద్యానగర సామ్రాజ్యము నీకీర్తి నిడుముల పాలుఁ గావించి పోవుచున్నావా? నాపై నీకేల యింత కోపము. ఔరా! తమ్ముఁడగు వేంకటాద్రిని భయపడకు మని హెచ్చరించు చున్నావే! నేను మాత్రము నీప్రియసోదరుడను గానా. నన్నేల యాదరింపవు? అకటా! అనుఁగుఁ దమ్ముఁడు వేంకటాద్రి గాంచిన సత్కీర్తియైన నేఁ గాంచ నైతిని గదా? తాళికోట రణావనిని సోదరునకు వామ భుజమై యుండి రామరాజు కొఱకుఁ బ్రాణము లర్పించి, యన్నతోఁ గూడి వీరస్వర్గము నలంకరింపఁ బోవు చుండెగదా.? తమ్ముడా! వేంకటాద్రీ! నీవైన నాతో మాటాడఁ గూడదా? అయ్యో! ఆనాఁడు నా పలుకు లాలకించి అన్నయగు రామరాజునకు సహిత మెదురు తిరిగితివే. ఆ విశ్వాసమైన నిపుడుంచి ఒక మాట మాటాడ రాదా. దయా

మయుండగు అన్నపైఁ దిరుగఁ బడుమని చెప్పినందులకై నా దరికి రా నిచ్ఛగింపవా లేక రణరంగమున శత్రు వీరుల డక్కాడి జయమునో లేక మరణించి మీవలె వీరస్వర్గమునో యలంకరింప నైతినను కోపమున రావా! సోదరులారా! కోపగింపకుఁడు నేఁడు కానిది గొల్లుంకి కాక మానదు. అన్నా! రామనృపాలా! ఆ నాఁడు మేము తిరుగఁబడి, మీ కపరాధముఁ గావించినను, మరల శరణన్న తోడనే భ్రాతృభావమును జూపి, మునుపటి కంటె నెక్కుడు ప్రేమఁ జూపి గారవించితివే. ఇపుడు మాటాడ వేల? నీ దర్శనమును వెదఁజల్లవేల? కరుణతోఁ గౌఁగలింపవేల? అపజయముఁ గాంచి, సిగ్గులేక బ్రతికి జీవచ్ఛవముఁ బోలె నున్నానని కోపమా. నే నూరకుందునా. ఇంతటితోఁ దురుష్కులు సుఖంబుందురని భావింపకుము. మీ కొనరించిన యపకృతికి మారొనరింపక మహమ్మదీయుల నిదురఁ బోనిత్తునా. అన్నా! పమి. అటులనే చేయుమని హెచ్చరించి, వేంకటాద్రినిఁ బిలుచుకొని పోయెదవా. ఇఁక మీఁదర్శనము నాకు గగన కుసుమ మేనా. అయ్యో! పోకుఁడు. పోకుఁడు (నిట్టూర్పు విడిచి) అకటా! అదృశ్యులై పోయిరే. కానిమ్ము. అయినదానికివగవఁ బనిలేదు. మా యన్నగారి కోర్కె నెఱవేర్చియే తీరవలయును. ఆన్నా! రామనృపాలా! శాంతింపుము. శాంతింపుము. త్వరలో వీరస్వర్గము నందుండు నీ యాత్మకు శాంతిఁ గలుగఁ జేసెద. ఓ కుమానా ముష్కర తురుష్క సుల్తానులారా!

మ॥ అని నా యన్నయు నీల్గి సంతటను మీ
రయ్యారె! గర్వంబుచేఁ
దనువుల్ దప్పఁగఁ దప్పఁద్రావియు, మధాం
ధత్వంబునన్ వేశ్య భా
మినులన్ గూడుచు నవ్వి పాడుచును, మ
మ్మెన్నో దూషించు మీ
తనువుల్ జీల్పఁగ నున్నవాఁడ, నిఁక మీఁ
కన్ మిమ్ముఁ బో నిత్తునే.

ఓరీ! మ్లేచ్ఛకుల వంశ పాంశనులారా! ఆస్మత్సోదరుఁడు కామరాజ నృపాలావతంసము కదనరంగమునఁ బడినంతలనె మీ హృదయ కంటక మూడి పడినదని సంతోష నాగరమున నోలలాడుచున్నారా? పిఱికి తురక పందలారా! రణావనిని ఖడ్గ కరవాలములఁ జేకొని యభిముఖులై హోరాహోరిని బోరియుండిన మీ పస గానఁబడి యుండెడిది. అటులఁగాక కుటిల తంత్రములఁ బన్ని, యొంటరిగ నేమఱియున్నతఁడే పలువురుఁ గలసి పైఁబడి కుత్తుకఁ గత్తిరించి జయము గాంచుట యోధాగ్రేసరుల లక్షణమా? మీరు యోధాగ్రేసరులై యుండిన గదా ఆ లక్షణములు దెలియుట.

తే.గీ॥ అందు వారిని బాధించు ♦ నల్పు లగుచు
బ్రాహ్మణులఁ బట్టి చంపెడి ♦ భ్రష్టు లగుచు
వనదలంబట్టి దోఁచెడి ♦ యధము లగుచుఁ
జనెడి మీరేడ యోధ ల ♦ క్షణము లేడ.

ఓరీ! హుసేన్ నిజాంశాహా! పరమ విరోధిగానుండి, నీ క్రొవ్వడఁగింపఁ గంకణముఁ గట్టికొని యుండిన గోలకొండ నవాబుతో నీకు మైత్రిఁ గలిగించి బిజాపురపు నవాబును జయింపఁ గల శక్తిఁ గలిగించిన మా యన్న రామరాజుపైఁ గారణములేని పగఁ బూని యపకారముఁ జేయ నీ కెటుల బుద్ధి యొప్పెను! దుర్మదాంధా! చేసిన మేలు మఱచిన నీచ చండాలా! నీ కుత్తుకఁ గత్తిరింపనిదే నాకు నిదుర పట్టునా. బేదర్ బరీద్ శాహా! పేరుఁ బ్రతిష్టలఁ గాంచక కూపస్థమండూకముఁ బోలె జీవించు చుండిన నిన్నుఁ బ్రోత్సాహపఱచిన మిత్రుఁడని భావింపక రామభూపాలునికి నపకారముఁ గలుగఁజేయుటకు నీ యంతరాత్మ యెటుల సమ్మతించెను! కృతఘ్నా నిన్ను నా కృపాణధార కాహుతిఁ గావింపక విడుతునను కొంటివా! ఆదిల్ శాహా దిక్కులేని యనాథవై యుండి మా రామ నృపాలుని పాదములమీఁదఁ బడి, శరణుఁ జొచ్చి పుత్రునివలెఁ జూచుకొను మని బ్రతిమాలి రామరాజును తండ్రీ! యని బిలచుచుఁ గడకు భవత్తుల్య పాంసనుల కుత్సిత వాక్యములకు లోబడి కుటిల మనస్కుఁడవై, తండ్రీ!యని నోరారఁ బిలచిన వాని తలఁ దఱిగితివి కదా? దుర్మార్గా! పితృద్రోహీ! ''తిన్న యింటి వాసము లెంచిన'' నీ రుధిరముచే మదీయ సోదరునికిఁ దర్పణముఁ గావింపక నాకు మనశ్శాంతి గలుగునా? ఓరీ! గోలకొండ నవాబూ! కుటిలమానసా! ఇబ్రహీం కుతుబ్ శాహా! నీ

యన్న యగు జంషీద్ నీ కుత్సుఁ గల్పించునను భయముచే నూ విజయనగరమునకు జొచ్చి మా యన్నను శరణు వేఁడఁ గా, నిన్ను సంరక్షించి యభయ మొసఁగి మా యన్న గతించువ ఱకు మా రాజ్యమునందొక జాగీరొసంగి జంషీద్ మరణా నంతరము నిన్నుఁ గోలకొండ రాజ్య సింహాసనము నధిష్ఠింప జేసినందులకు మంచిబహుమాన మొసంగితివి. పితృహంతకుఁ డగు ఆదిల్ శాహా నిన్ను సహాయము వేఁడినంతనె, నిన్నుఁ బో షించిన మాయన్నగారి మీఁదికి రణమునకు రానని చెప్పక, వెంటనే సమ్మతిని జూపి, నీవే తిక్కుంగల నవాబులందఱికిఁ మైత్రిఁ గలిగించి అందఱను జేర్చుకొని పోనునకుఁ గడంగి వి జయనగర రాజ్యమును నాశన మొనరించుటకు మూల కార ణ మైతివా? ద్రోహీ! అవమాఫీమా! విజయనగర సామ్రాజ్య వినాశమునకుఁ గారణ భూతుఁడవగు నీ ప్రేవులఁ దీసి జన్నిద ముగ ధరింపక మానుదు ననుకొంటివా? దుర్మతీ! మా యన్న యసువులఁ బాపుటకు మూల కారణ భూతుఁడైన నీ క్రొ వ్వును గరిఁగించి జ్యోతిని వెలిఁగించు వఱకు నా హృదయ మున రవులుకొనుచున్న దావాగ్ని చల్లారునా? "పాపీచిరా యు" వన్నట్లు కాటికిఁ గాళ్లుఁ జాచిన ముసలి పీనుఁగా! గద్దకు వచ్చినటుల నేండ్లు వచ్చినను నీ నీచబుద్ధి మానక పోయెఁగ దా! బ్రతికినన్ని దినములు బ్రతుకఁ బోవుకదా! అది తెలిసి యు నేలొనరించిన రామనృపాలుని కపరాధ మొనరించిన నీ కండలు కాకులకు వేసినను పాపము రానేరదు గదా? నా

కంఠమునఁ బ్రాణము లున్నంతవఱకు నీ వొనరించిన యపకృతి మరతునా? విజయనగరమును నాశనముఁ జేయించిన నీ గోలకొండ కుతుబ్ శాహి వంశమును రూపు మాపక విరమింతునా? నీ వొనరించిన ఘోర ద్రోహమునకు నీవుత్వరలో మృతినొంది యమపురి కేగితివి, నీ పుత్ర పౌత్రులఁ బట్టి చెండాడి నీ వంశమును రూపు మాపెదఁగాని,నీవు గతించి నంతటనె నా క్రోధమును మాని శాంతి వహింపను. గోలకొండ రాజ్య నాశనముగువఱకు నాకు శాంతి గలుగనేరదు. ప్రథమమున నీ వంశమును రూపు మాపి పిదప నీవిజయనగర రాజ్యమును పూర్వపు స్థితికిఁ దెచ్చి తదుపరి తక్కుంగల తురుష్క ధముల జక్కాడెదఁ గాక. కానిండు. కానిండు. "ముందున్నది ముసుళ్ల పండుగ" విజయనగరభాగ్యవిధాతా! ఇదే నా దృఢ సంకల్పమును వినుము.

ఉ॥ ముందుగ గోలకొండ నగిఁ
బూర్తిగ నాశన మొందఁ జేసియా
సుందరమూర్తికిన్ దిగుల
సోమునిఁ గేలెదు రామరాజకా
మందులరక్తముఁగొని, య
పారమునందంబును జెందునట్టులా
నందముతోడఁ దర్పణము
నామనసారఁగఁ జేయకుందునే.

(రోజన నభినయించి) ఏమి. నే నేమి ఘోర ప్ర

మాణమును గావించితిని. అది కొనసాగుటెట్లు? సమర రంగము
న మా యన్న కూలి నంతటనె, సైన్య సమూహ మంతయుఁ
జెల్లాచెదరై చెప్పకుండఁ బాఱి పోయిరి. వారి నందఱను మ
రలఁ జేర్చుటకును దుష్కృతుల జయించు నంతటి సేనలను
గూర్చుటకును గొన్ని వత్సరములు పట్టును. అంత వఱకు మా చి
న్న మామగారగు సదాశివరాయల వారిని పెనుగొండ సిం
హాసనముపైఁ గూర్చుండఁ బెట్టి అచ్యుతరాయల కాలమం
దు రామరాజు రాజ్య వ్యవహారములు జరిపించినటులఁ గావిం
చెద. మా మామగారు సహితము నా పలుకులఁ గాదని పోఁ
జాలరు. నేను మరలఁ దగిన సైన్యమును జేర్చునఱకు నివురుఁ
గప్పిన నిప్పుఁబోలె నుండెద. సైన్యములు సిద్ధమైన తోడనె గో
ల్కొండపై ధ్వజము నెత్తెదఁ గాక. తురకసేన పట్టణమును జొ
చ్చి దోఁచుటకుఁ బ్రారంభింపక మునుపే యందలి ధనమంత
యుఁ గూర్చి గజాశ్వ సమూహముల పై వేసికొని రమ్మనియు
పెనుగొండ కేగి యచటనె రాజ్య స్థాపనముఁ జేసికొందమని
యు సదాశివరాయలవారికిఁ జెప్పితిని. వారు సహితము కొంద
ఱు భటులను వెంటఁ దీసికొని పట్టణమును బ్రవేశించిరి. ఇప్ప
టికి చాలఁ దడవై యున్నది. ఇఁకఁ గొంతసేపటికైనను వా
రు రావచ్చును. (అటునిటుఁ జూచి) ఓహో! సదాశివరాయల
వారేతెంచుచున్నారు. ఏమి జరిగించి వచ్చిరో యడిగి తెలి
సికొందును గాక.

ప్రవేశము:—సదాశివరాయలు త్వరితగతి
నభినయించుచు వచ్చును.

తిరు:—మామ గారూ! మీరు కేగిన కార్యమును సాధించుకొని
యే వచ్చితిరని భావించెద.

సదా:—తిరుమలరాయా! మనకు దైవబలము తక్కువగుటచే
మాయావులగు తురుష్కాధముల, రామరాజు పూర్తిగ న
మ్మి యేమరి యున్నందునను తాళికోట యుద్ధ భూమి
ని నవజయమును గాంచితిమి గాని మనము చేయు స
మకట్టిన కార్య మేదైనను ఫలింపక వృథ యగున్యా చే
యవలసిన కార్యముల నన్నిటినిఁ బూర్తిగను, ననుకూలము
గను జేసికొనియే వచ్చితిని గాని యూరక రాలేదు.

తిరు:—ఒక చిల్లి గవ్వనైనఁ బోనియ్యక భద్రపరచి సా
గించుకొని వచ్చితిరి గదా?

సదా:—తురక నవాబులకు మూఁడు క్రోవల మట్టిగాక
వేతేమియు లభింపఁ బోదు. బంగారమును వజ్ర వైడూర్య
గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్యములను జేర్చి
యేనూట యేఁబది గజములపై వేసి, తక్కిన విలువగల
రత్నాభరణములను వెండి మొదలగు వస్తువులను నశ్వ
ములపై నెత్తించుకొని వచ్చితిని. తురకలు రాకమునుపే
మనము పెనుగొండఁ జేరఁ బోవలయును సుమా!

తిరు:—ఆ యేనుఁగులును గుఱ్ఱములును నెక్కడ నున్నవి.

సదా:—వానిని రాజ మార్గమునఁ దీసికొని వచ్చిన శ్రేయ

స్కారము గాదని అరణ్య మార్గమున భటుల వెంటఁ బం
పితిని. మన బంధువులుఁ గూడ వారి వెంటనె పోవుచున్నా
రు. మనముగూడఁ ద్వరితముగ వారినిఁ గలిసికొనుట మం
చిది.

తిరు:—చిత్తము.అటులనె బోదమురండు.

(నిష్క్రమింతురు)

# ద్వితీయరంగము

ప్రవేశము:—భామినీసుల్తానులు విజయనగరము నందలి యొ
కానొక స్థలమున నిలచి మాటాడుచుందురు.

కులీకుతుబ్ శాహా:—మిత్రులారా! సంఘీభావముయొక్క బల
మును నేఁటికి గ్రహించితిరి గదా.

హుశేనిజాంశాహా—మిత్రమా! ఇంకను దెలిసికొన కుం
దుమా. ప్రథమమునుండియు నీవంటి కుశాగ్రబుద్ధి మా
కు హితవుఁ గరపి యుండిన, హిందూరాజ్యము నెన్నఁడో
దిగమ్రింగి యుండమా.

అలీఆదిల్షా—అన్నా! కుతుబ్ శాహా! మే మిన్నిదినములు
దురాశాబుద్ధులమై, గాఢాంధకార మహార్ణవమునఁ బడి
అసమాన దుర్గర్వ దురభిమానావిష్ట దేహులమై, రామ
రాజ తంత్రముల యందలి గూఢార్థమును గ్రహింపలేని
వారమై, మతాచారాభిమానములను మంటఁ గలిపియా

హిందూ రాజాధములచేతి కీలుబొమ్మలమై యుంటిమి.
నీవు మాకందఱికి నైకమత్యముఁ గలిగించి హిందువుల
బారినుండి దరిఁజేర్చి పుణ్యముఁ గట్టికొంటివి. అల్లా నిఁ
న్ను చక్కఁగఁ గాపాడుఁగాక.

కులీకుతుబ్ శాహా—ఇంతటితో మన కష్టములు దప్పిపోయెన
ని సంతసింపకుఁడు. యుద్ధమున రామనృపాలుని తమ్ము
డు తిరుమలరాజు తప్పించుకొని పోయి యున్నాడు. ఆ
దురాత్ముఁడూరకుండఁడు సుమా. రణావనిని నన్నుఁ జూ
చి జాగ్రతయని మీసముదిద్ది పోయి యున్నాఁడు. నేను
మీకందఱకు నైకమత్యముఁ గల్పించి విజయనగరరాజ్య
నాశనమునకుఁ గారకుఁడ నైతినని, నా వంశమును నిర్మూ
లము గావించు వఱకు విడువనని చెప్పి తప్పించుకొని పో
యెను. కాఁబట్టి తిరుమలరాజును మట్టుపెట్టక మన కష్ట
ములు దీఱవు.

బరీదుషా—తిరుమలరాజు మీ రాజ్యముమీఁది కేతెంచిన
మా రాజ్యము లూరకుండునా! ఇప్పటి యైకమత్య మ
ప్పుడు మాత్ర మెక్కడికిఁ బోవును.

అలీఅదిల్‌షా—మిత్రులారా! ఇఁక మీఁదట మనమెప్పటికిని
నీ మైత్రిని మాని వైరములఁ గల్పించుకొనరాదు. ఈ యై
కమత్యమే గదా.

సీ॥ శ్రీలకు విశ్వకుఁ • సింధువై వెలసిన
విద్యానగరమును • వెల్లిఁ గలిపెఁ

గిఱకుఁ దురకలని • కడుహీనతం జూచు
నాంధ్ర భూపతులను • నవనిఁ గలిపె
భామినీ రాజుల • బదగునట్లానరించు
రాజుల నెపుడా ప • రాదిఁ జేసె
జేతి బొమ్మలరీతిఁ • జేసి యాడించిన
రామభూపాలుని • భూమిఁ గలిపె
తే. గీ॥ సమర రంగంబు నందున • జయముఁ గూర్చె
ఆంధ్ర రాజ్యేందిరను • వేగ యపవిఁ జేర్చె.
మన ముసల్మాను రాజ్యముల్ • ప్రబలఁ జేసె
"ఏకమత్యంబునకు నాటి • యవనిఁ గలదె"

కనుక మనము నింతెర మీా దైకమత్యమునే గలిగి యుండవలెను. అటులఁగాక మనలో మనముఁ గలహించుకొనుచుండిన, మన స్వాతంత్ర్యములఁ గోలుపోయి పరరాజుల పై నాధారపడి భామినీ సుల్తానులము వారి బానిసలమై యుండవలసి వచ్చును. తక్కుంగల సంగతులను నావకాశముగ మాటాడుకొన వచ్చును. ప్రథమమున విజయనగర పట్టణమును దోఁచి గుళ్లను గోపురములను రాజమందిరములను బ్రద్దలగునట్లు ఫిరంగులతోఁ గాల్చి వేయుమని సేనాధిపతికి నాజ్ఞ నొసంగితిమి. వారింకనుఁ బ్రారంభించిరో లేదో. మన సైనికులకు హిందువులను వారి యిష్టము వచ్చినటులఁ బరాభవింప వచ్చునని సెలవిచ్చి యున్నాను. మీకు సమ్మతమే గదా.

జకీదుషా—నాకు సమ్మతమే.

హుస్సేన్‌నిజాంశాహా—నాకుఁగూడ నిష్టమే.

కులీకుతుబ్‌శాహా—నాకు మాత్రమిష్టము లేకుండునా. నవాబు వంశస్థురాలును. నుత్కృష్ట వంశ సంజాతయు నగు మహమ్మదీయ నారీరత్నమును నిండుసభాంతరమున మేలిముసుఁగుఁ దీయించి యవమాన పరచిన హిందువుల నే మొనరించినను నాకు సమ్మతమె. (లోపలదీన్‌దీన్‌మారో మారో అను శబ్దములను పిరంగుల శబ్దములను వినుట నభినయించి) అదిగో. మన సైనికులు పట్టణమును నాశనముఁ జేయు చున్నారు. ఇది గదా భామినీ సుల్తానులకు సంతోషదినము.

ప్రవేశము:—సైనికుఁడు నేలకు వంగి సల్లాములఁ జేయుచు వచ్చును.

అలీఅదిల్‌షా—ఓరీ! నీకానతిచ్చిన కార్యమును చక్కఁగఁ జేసితివియా.

సైనికుఁడు—సర్కార్! నేను మీ యాజ్ఞ చొప్పున నూర్గురు సిపాయులను వెంటఁ బెట్టుకొని దేవాలయములఁ బ్రవేశించితిని. విగ్రహముల ముక్కలు ముక్కలుగఁ జెక్కించితిని. గోపురములఁ బడఁగొట్టించితిని. ఒక గుడిలోనికిఁ బోఁగా దానిలోనుండిన నల్లని గుండుచుట్టు గొప్పసర్పముండెను. అది మమ్ముఁ జూచిన తోడనే యదృశ్యమై పోయె. అంతట గుండును బగులఁగొట్టనెంచి యెంత

ప్రయత్నముఁ జేసినను మా చేతఁ గాక పోయెను. అంత
ట దానిపై మలమూత్రములఁ బోయించి గోవును సంహా
రించి యా రక్తము నాలయమంతటను జల్లించి వచ్చితిని.

ఆలీఅడిల్ షా—సంతోషము. సంతోషము. సరి. నీవిఁకఁ
బోవచ్చును.

ప్రవేశము:—సైనికుఁడు సలాములఁ జేయుచు వచ్చును.

ఆలీఅడిల్ షా—ఓరీ! నీవొనరించిన కార్యములఁ జేర్కొనుము

సైనికుఁడు—మహారాజ్! నేను కొందఱు సిపాయిలను వెంట
నిడుకొని వర్తకుల వాడఁ బ్రవేశించి ధాన్యము నంత
యుఁ గొల్లఁ జేసి మన సైనికుల భోజనార్థము గుడార
ములకుఁ బంపితిని. వర్తక స్త్రీలను బట్టి యొక్కొక్కరి కొ
క్క యువతిని బుచ్చుకొండని సైనికుల కాజ్ఞ నొసఁగితిని.
కొందఱు స్త్రీలను గట్టుకొనిన చీరలను విడిపించి కోలాట
ము వేయించితిని. కొందఱిని దిగంబరులను గావించి
యెండలోఁ బరుండఁబెట్టి బాధించితిని. హిందువుల మిక్కి
లి బాధించి కసిదీర్చుకొంటిని, నా వెంట నిరువురిని బిలు
చుకొని వచ్చితిని. వారిని విచారించి విగ్రహారాధకులలో
నుండు దురభ్యాసములఁ దెలిసికొనుఁడు.

ఆలీఅడిల్ షా—ఎక్కడ వారిని దీసికొని రమ్ము, (సైనికుఁడు
వికారాకారముగల యొక వర్తకుని నెనిమిది వత్సరముల
బాలికను బిలుచుకొనివచ్చును.) అచ్చా! బహుబాగున్నది.
అరే. కోమటీ! నీ పేరేమి?

పెద్దిశెట్టి—నా పేరు పెద్దిశెట్టి, మహాప్రభూ:—(అర్ధోక్తి)

ఆలీఅడిల్‌షా—అరే ఎక్కువ వదరకుము. అడిగినదానికి బదులు చెప్పుచుండవలెను.

పెద్దిశెట్టి—అదిగాదండీ! మా కష్టము

సైనికుఁడు—నీకు బుద్ధిలేదా? సర్కార్ చెప్పుచుండునది వినలేదా? అడిగినదానికి జవాబు చెప్పుము. ఎక్కువ ప్రేలిన శాంతి యగును.

ఆలీఅడిల్‌షా—ఈ యువతి నీ కేమి కావలయును.

పెద్దిశెట్టి—ఏమి కావలయును. మా యింటి దే.

ఆలిఅడిల్‌షా—మా యింటిదనఁగా నా కర్థము కాలేదు. విశదముగఁ జెప్పుము. నీ వధిక ప్రసంగముఁ జేసిన చర్మము దీయించెదను.

పెద్దసెట్టి—అబ్బో! అంతకార్యముఁ జేయించ వలదు. విశదముగా జెప్పెదను. (భార్యను జూపుచు) ఈ చిన్నది నా భార్య. పెండ్లియై పదునాలుగు సంవత్సరములు మాత్రమయినది.

ఆలీఅడిల్‌షా—(కోపముతో) ఓరీ! నీచా! నీవు కాకివలె నున్నావు. ఆసుందరి బంగరు ప్రతిమవలె మెరయుచున్నది. ఎన్నటికిని నిన్నామానిని కోరి వివాహ మాడియుండదు.

పెద్దసెట్టి—(స్వగతము) అబ్బో! ఇంకేమున్నది. నా కొంప కూలినదన్న మాటయే. ఈ తీరున వర్ణించు చున్నాఁడు. అబ్బో! వీఁడు నా భార్యపైఁ గన్ను వేసినటు లున్నది. ఈ

తురక నాకుదక్కనిచ్చునో దక్కనియ్యఁడో. అన్నిటికి మా అమ్మోన్నరే దిక్కు. కానిమ్ము చూచెద. (ప్రకాశముగా) నవాబ్ మహారాజ్! నిక్కముగ వివాహమాడి యున్నది.

ఆలీఅకిల్ షా—(స్త్రీనిఁ జూచి) ఈతఁడు నిజముగ నీ భర్తయే నా? నీవు కోరి వరించితివా?

వర్తక స్త్రీ—అవును. ఈయన నా భర్తయే. నాకు నాలుగేడుల వయస్సులో వివాహమైనదట. వివాహమైన సంగతి నాకు జ్ఞాపక మేమియు లేదు. నేను కోరి పరిణయ మాడి యుండ లేదు. నా పెండ్లి కాలమున కీయనకు నేఁబది యేఁడులు దాటి యుండినవఁట. మా కులమున మేనరికమను నొక పద్ధతి గలదు. మేనరికమున్న వారు పురుషుఁడు కుంటికాని కురూపి కాని కన్యక నతనికొసఁగి యే తీరవలయును. ఆ యాచారమునుబట్టి మానాయన కడుబీదవాఁడై యుండుటయే కాక వృద్ధుఁడును రూపసియుఁ గానట్టి వాఁడైనను బదివేల రూప్యముల నొసఁగి నన్నిచ్చి వివాహముఁ గావించి యున్నారఁట. నేను గాపురమునకు వచ్చి నాలుగేండ్లు కావచ్చినది. ఈయన నిజముగ నా పెనిమిటియే.

ఆలీఅకిల్ షా—సెట్టిగా: ఎంత యన్యాయము జేసితివి. నిన్ను బదివేల ధనమిచ్చి కొనిరా. ఆమరాత్ములకు నీకంటె మంచి యువకుఁడు లభింపక పోయెనా? మేనరికమిచ్చిరా, బద్మాష్! నీ కిటువంటి స్త్రీ యెందులకురా. (సైనికునిఁ జూచి) ఓరీ! నీవీ కాంతను దెచ్చితివి. నీవే "నికా"ఁ జేసి కొ

నుము. వీని ధనమంతయు మా కడఁ జేర్పుము.

సైనికుడు—సర్కారు! మీ యానతి మీఱఁ గలనా. అట్టులే చేసెద.

పెద్దసెట్టి—అయ్యో! అయ్యో! నా కొంప ముంచినారు. బాబూ! పదివేల రూప్యము లిచ్చెదను గాని నా భార్యను విడువుఁడు.

అలీఅదిల్‌షా—ఓరి! మాయుత్తర్వు తిరుగునది కాదు, నీ భార్య నేమి చేయుదువు.

పెద్దసెట్టి—నా యింటికిఁ బిలుచుకొని పోయెదను.

అలీఅదిల్‌షా—నిన్నింటికిఁ బోనిచ్చువా రెవరు?

పెద్దసెట్టి—(వడఁకుచు) అయ్యో! నన్నేమిఁ జేయ నెంచితిరి.

అలీఅదిల్‌షా—నీ చర్మము దీయించి నీ భార్యకుఁ బాదరక్షలఁ జేయించెదము. వృద్ధుఁడవయ్యు బాలికను పెండ్లాడి నందులకు నీ కిదియే బహుమానము.

పెద్దసెట్టి—అయ్యా! నా భార్యను మీరే దీసికొనుఁడు. నన్ను మాత్రము వదలివేయుఁడు.

అలీఅదిల్‌షా—ఓరీ! వీనిని దీసికొని పోయి కసాయి వారి స్వాధీనముఁ జేయుము ఆజ్ఞ్యము చేయుకుము.

సైనికుఁడు—చిత్తము (అని తోడ్కొని పోవుచుండ)

పెద్దసెట్టి—అకటా! నేను ముదుసలినై యీ యువతిని బెండ్లాడినందున గదా. సుల్తానుకుఁ గోపమువచ్చి నన్నుఁ జంపించు చున్నాఁడు. ఇంక మీఁదటఁ గూడ మేనరికపు టలవా

టుండిన మా సంఘముగతి యింతయే. ఇఁక మీఁదట మా వారి పెద్దయలవాటుల మానఁ గోరెద. వధూవరుల ను బాగుగఁ జూచి వివాహములఁ జేయ వేఁడెద. వైశ్య సంఘ నాయకులారా! నా గతి వీక్షింపుడు. ఇఁకనైన మేల్కనుఁడు సంఘాభివృద్ధిఁ గోరుఁడు నా మనవి వినుఁడు.

సీ॥ మేనత్తకొంబును ♦ మీఁ అరాదని పుత్రి
వెంగళప్పలకిచ్చు ♦ బేయలార!
మగ కుమారుఁడు సైన ♦ సొమ్ము ధనంబిచ్చి
వసులను గొనియొడి ♦ వణిజు లార!
అయిదేండ్ల కన్యకు ♦ నఱువది యేండ్ల
యధముఁడ గట్టుచే ♦ వాగులార!
ధనమున్న సరియని ♦ తగని దాంపత్యము
లాచరించుచు నుండు ♦ నార్యులార!

తే.గీ॥ పావలకుఁ బెండ్లిఁ జేయుట ♦ పాడిగాదు
వసుల ధనమిచ్చి కొనుటయు ♦ సరియుఁగాదు
నాదుగతిఁ జూచి మీరిఁక ♦ మీఁదనైన
మానుఁడీ వరవిక్రయ ♦ హీనగతుల॥

(నిష్క్రమించును)

అలీఅక్బర్ షా—(కలీకుతుబ్ శాహానుజూచి) మిత్రమా! గోల కొండ సైనికుఁడు వచ్చుచున్నటు లున్నది, వానిని నీవే విచారింపుము.

ప్రవేశము:—గోలకొండ సైనికుఁడు వంగి సలామొనరించుచు వచ్చినిలుచును.

కులీకుతుబ్‌శాహా—ఓరీ! నీకుఁ జెప్పిన ప్రకారము నడుచుకొంటివా!

సైనికుఁడు—సర్కార్! తమ యానతి మేఱకు భటుల వెంట నిడుకొని బ్రాహ్మణాగ్రహారముఁ బ్రవేశించి వారి గృహములను గొల్లఁ గొట్టి ధనమునంతయు గుడారములలో భద్రపఱుపుమని పంపితిని. మహారాజ్! ఏమని చెప్పఁగలను. బ్రాహ్మణులలో బాల విధవ లసంఖ్యాకులుగ నున్నారు.

కులీకుతుబ్‌శాహా—వారిని విడిచి వచ్చితివా? ఏమి జేసితివి.

సైనికుఁడు—వారిని నూరక విడిచి వత్తునా? మన సైన్యములోఁ గొందఱు వివాహితులు గానివారుండ నొక్కొకరికొక విధవను గట్టిపెట్టి సుఖమును గలిగించితిని. తురకలను జూడరాదను బోడిముండల నోట గోమాంసమును బెట్టించితిని. మహమ్మదీయ స్పర్శఁగలిగిన దేహమునందలి చర్మమును దీసి వేయువఱకు మైలపోదను శాస్త్రులకంఠమునఁ జెప్పుల దండల వేయించితిని. అవధానులకు ఆచార్యులకు నాపుర క్తముఁ ద్రావించితి. అంతటితోఁ బోని య్యక యన్యాయమున గొడిగట్టిన రొయిశానొక వృద్ధవిప్రుని, నతని భార్యను బట్టి తెచ్చితిని. వారిని విచారించి యిఁక మీఁదట బ్రాహ్మణ సంఘములలో నిట్టి విపరీతములు జరుగ నీకగుర్తుపెట్టి మానినులకు మేలు గలుగఁజేసి కాపాడుఁడు.

కులీకుతుబ్ శాహా—సరి విచారించెదను వారినిఁ దోడ్కొని రమ్ము.

సైనికుఁడు—ఇచ్చటనే యున్నారు. ఓరీ! సోమయాజిగా! యిటురమ్ము.

(ప్రవేశము:—ముదుసలి సోమయాజి భార్యాసమేతుఁడై కుడిచేతఁ గఱ్ఱను నెడమచేత నగ్నిహోత్రపు గుండను బట్టుకొని వచ్చును.

సోమ—హరే రామ హరే రామ రామ రామ హరే హరే హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే (అర్థోక్తి)

కులీకుతుబ్ శాహా—ఓరీ! బాబనపిశాచీ! ఆమాట యింకొకసారి యన్న నీకు వాఁత వేయించెదను. అరె అల్లా అరె అలా యని బాగుగ వాడుము.

సోమ—(స్వగతము) దురాత్ముఁడు హరే యను పలుకునకు అర్థమును అరే యని యనుకొని నాఁడు. హరియన వారికిఁ దెలిసి యుండినకదా. భగవంతుఁడు సర్వుల కొకఁడేయను మాటను మఱచి మూఢ మనస్కుఁడై ఒక్కొకరి కొక్కొక దేవుఁ డున్నాఁడని భావించినాఁడు. భాషాభేదముల చే పలుపేరులఁ బిలువవలసి వచ్చెనని తెలిసియుండిన కదా. వారికిని నల్లాకును భేద మేమున్నది. హరే యనినంతటనే వీని చెవుల శాశ్వము ముల్లైయె నాటి హరే యనుటకు మారు అరే యను మనసు వీని యర్థము కాలి పోను కానిమ్ము తగినటు లొనరించెద. "హరే అల్ల హరే అల్లా

అల్లఅల్ల హారే హారే (స్వగతము) ఇపుడూ హరి శబ్దము రా లేదా.

కలీకుతుబ్ శాహా—అచ్చా! బాగుగనున్నది. ఇఁకఁ జాలింపుము. ఓరీ! నీ వెంట నిప్పుకుండను గొని తెచ్చుచున్నావేల నీకు చలిగొనుచున్నదా?

సోమ—నీ కేమి తెలియునురా. నీవు కర్మ హీనుఁడవు నేను సోమయాజినని తెలియదా? ఆ యగ్నిని సదా ఆరిపోకుండ గాపాడుకొను భారము నా తలపై నున్నది సుమా.

సైనికుఁడు—అరే బేఖూబ్! నవాబ్ సాబుగారిని ఓరీ! యని యదవా నీ పండ్లూడఁ గొట్టెదను చూడుము.

సోమ—(భయముతో) నాయనా! నేను చతుర్వేదములను సకల శాస్త్రములను జదివిన పండితుఁడను. అనేక యాగములఁ జేసిన వృద్ధ సోమయాజిని. అదియుఁ గాదంటి రేని సగ్రజన్ముఁడను. ఓరీ యని పిలచినఁ దప్పు లేదు సుమా!

కులీకుతుబ్ శాహా—ఓరీ! అగ్రజన్ముఁడవైన మాకేటి. హాగరుఁ జోతు మాటల రానియ్యకుము. మేము సుల్తానుల మనునది యెఱుఁగవా! ఓరీ! ముందుగఁనీని యగ్నిలోఁ గల్లుఁ బోయించి ఆర్పివేయుము. (అనఁగా సైనికుఁడు అగ్నిహోత్రమును దీసికొనును.

సోమ—అయ్యో! అయ్యో! పాపము సంభవించును. అటుఁ జేయకుఁడు.

కులీకుతుబ్—అరే పాపము నీకుఁగాని మాకుఁగాదు. అయిన

మా సైనికుఁడు నిన్నిటకుఁ గొనితెచ్చుటకు గతంబేమి?

సోమ—సుల్తానుప్రభూ! మీ సైనికులలో నొకఁడు చిన్నది యగు నా భార్యను దీసికొని పోవుచుండ నేనడుగఁబోయి సుల్తానుగారితోఁ జెప్పి మరల నా కొసంగునటులఁ జేసి కొందును రమ్మని చెప్పి పిలుచుకొని వచ్చితిని.

కులికుతుబ్ శాహా—నీ వయస్సెంత

సోమ—ఎక్కడిది నాయనా! షష్టిపూర్తియై యిప్పటికి పదునైదు వత్సరము లైనది.

కులికుతుబ్ శాహా—నీ భార్య కెన్నవ యేఁడు.

సోమ—ఎక్కడిది ఆఱవయేఁడు పడినది.

కులికుతుబ్ శాహా—ఓరీ నీచా! బ్రాహ్మణాధమా! నీవు బ్రాహ్మణుఁడ వెటు లైతివి. డెబ్బదియైదు వత్సరముల ముదుసలి యాఱేండ్ల బాలికను వివాహమాడ వచ్చునా! గాడిదా! కాకికి వచ్చినటు లేండ్లు వచ్చినవిగాని బుద్ధి రాలేదు. (సైనికుని జూచి) ఏది. బాలికను బిలుచుకొని రమ్ము చూడవలయును.

సైనికుఁడు—చిత్తము [అని ప్రక్కనున్న బాలికను బిలుచుకొని వచ్చును]

సోమ—మహాప్రభూ! అగ్నిహోత్రమునకై పదివేల రూపాయల నొసఁగి వివాహమాడితిని.

కులికుతుబ్ శాహా—(బాలికను బాగుగఁ దిలకించి) అయ్యో! పాపము! అభము శుభము తెలియఁగని కసికందు త్రిలోక

సుందరియే. వయసువచ్చిన నెటులుండునో గదా. ఇట్టి బాలికామణికి మగఁడుశతవృద్ధుఁడా! (సోమయాజిని జూచి) ఓరీ! ముసలితొత్తా! అగ్నిహోత్రమునకంటివి నీవు మృత్యు నొందఁగాఁ జితి నంటించుటకా? [తక్కిన సుల్తానులను జూచి] మిత్రులారా! ఈకన్యక నేమి చేయు మందురు. ఈ వృద్ధపీనుఁగు నేమి చేసిన పాపము బోవును.

అలీఆదిల్‌షా—మిత్రమా! ఈ బాలికను మన శిబిరమునకుఁ బంపి మనమే జాగ్రతగఁ బెంచుచు మనబందుగులలో నే యువకునికైన నిచ్చి వివాహముఁ జేసి సంతసింతము ద్వాదశవర్షముల ప్రాయము వచ్చువఱకు నీమెఱుపుఁ దీఁగెను ఈ సైనికుని యింటనే బెంచునటుల నుత్తరువుఁ జేయుము ఈ ముసలిపీనుఁగనన్నఁ జిత్రవధఁ జేయింపుము. అటుల నొనరించినఁ గాని హిందువులకుఁ దెలివి రాదు.

కులీకుతుబ్—(సైనికునిజూచి) ఓరీ! ఈ కన్యకకు పంద్రెండు వత్సరముల యీడు వచ్చువఱకు నీ యింటఁ బెంచుము. ఈమెకగు కర్చులను మేమొసఁగెదము. జాగ్రతగఁ గాపాడవలయును. ఈ ముసలి వానిని చిత్రవధఁ జేయింపుము. ఇదే మా యాజ్ఞ.

సైనికుఁడు—మహాభాగ్యము (అని సోయమాజిని మెడ మీఁదఁ జేయివైచి పిలుచుకొని పోవ నుద్యమించును)

సోమ—(పోవుచు) అకటా! నే నన్నిఁటఁ జెడితిని. హిందూ నృపాలురతోఁ బాటు బ్రాహ్మణులు నాశనము గావలసిన

సమయము తటస్థించెను. అపుడు నాకుఁ దగిన శిక్షయే వి ధించిరి. పసిపాపల వివాహమాడి వారి యాశల నడుగంటఁ జేయు నావంటి మూర్ఖులకుగువారికిట్టి శిక్షగాక వేఱే ముండును. ధనమునకాసపడి పసికూనల నమ్ము వారినిఁ గూడ నిట్లనే చేయింప వలయును. హిందూమహాసం ఘమునకుఁ గన్యావరవిక్రయములు మహామారులై నాశన ము జేయుచున్నవని నేఁటికి మనస్యానులు తెలియఁ జాఁ లఁ గలిగిరి. ఇఁక మీఁదనైన

సీ॥ అర్కుల పేరిటి ♦ యడుగు దేశుల మీఁద
నాశపడఁగొను సోమ ♦ యాజులార!
ధనపిశాచముఁ బట్టి ♦ ధర్మముఁ బోఁద్రోసి
పిడ్డలఁ దెగనమ్ము ♦ విప్రులార!
పసిపాపఁగొని పెండ్లి ♦ బాగుండునని చేసి
బాలవిధవఁ జేయు ♦ భ్రష్టులార!
పంచవివాహముల్ ♦ బాగని వృద్ధులై
వణియమాడెడి ♦ పాపులార!
ఆ వె॥ కన్యకలను వరుల ♦ కిడునీచ మమ్ముట
వసల వలయు దాని ♦ వసల కన్న
విప్రసంఘమింక ♦ వెడలు నసత్యమె
కనుఁడు నాదు గతులఁ ♦ గన్నులార!

(నిష్క్రమింతురు)

ప్రవేశము— సైనికుఁడు సలాముచేయుచు వచ్చును.

కలీకుతుబ్— ఓరీ! నీవేమి చేసివచ్చితివో చెప్పుము.

సైనికుఁడు— సర్కార్! నేను గొందువేల సైనికులతోఁ బో యి రాజమందిరములను సంస్కృత పాఠశాలలను ఫిరంగులచేఁ గాల్పించి నేలఁ గూల్పించితిని. హిందువుఁడు కనఁబడిన వతికి వేయించితిని. గోవులను సంహరించి వాని రక్తమును బ్రాహ్మణులకుఁ ద్రావితిని విప్రుల తలలఁ గొఱిగించి జన్నిదములఁ ద్రెంచి మన మతమును స్వీకరింపఁ జేసితిని. హిందువుల నెన్నివిధములఁ బరాభవింప వలయునో యన్నివిధముల బరాభవించి కసిదీర్చుకొని వచ్చితిని, ధనమేమియు దొరకలేదు. దురాత్ములు దాని నెటులనో సంగ్రహించుకొని పోయియున్నారు.

అలీఅడిల్షా— సరి మిత్రులార! పాడుపడిన పట్టణమును మన మేమిచేయవలయును. మన రాజ్యముల విడచివచ్చి చాల కాలమైనది. ఏగతి పట్టినవో. ఇఁక జాగొనరింపక ప్రయాణమై పోవుట మేలు.

ప్రవేశము:— గోలకొండనుండి శేఖనుగొని యొక భటుఁడు వచ్చి సలాము చేయును.

కులికుతుబ్— ఓరీ! నీ వెందుకు వచ్చితివి?

భటుఁడు— సర్కార్! మీకుమారుఁడు జాబు నొసఁగి పంపియున్నాఁడు,

ఇలీకుతుబ్—ఇటులెమ్ము (లోపలఁజదువుకొని) హా! అపకీర్తి.
శాశ్వతమైన యపయశము వాటిల్లెను ఓరీ! మురారిరావు!
నిన్ను నమ్మి రాజ్యభారమును నీపై వదలి వచ్చినందులకు
నా కపఖ్యాతిఁ దెచ్చితివా? ఔరా! నారాజ్యము బాగువ
డుటెట్టుల నాదుఃఖము మారుటెట్టుల హా (అనిదుఃఖము
నభినయించును.

అలీఆదిల్‌షా—మిత్రమా! ఏమా లేఖ. ఏల చింతిల్లెదవు.

ఇలీకుతుబ్ శాహా—నేఁజెప్పఁజాల మీరె చదువుఁడు (లేఖ
నొసఁగును)

అలీఆదిల్‌షా—(లేఖ నందుకొని విప్పి)

ప్రియమగు తండ్రిగారికి

మీరు మురారిరావున కధికారము నొసం
గి పోయితిరి. అతఁడు రాజ్యము నరాజకముఁ జేసిచి యు
న్నాడు. మీరు వచ్చిన నన్నియు విశదమగును. త్వరలో రా
నంతట రాజ్యము మనది కాదు.

మీ పుత్రుఁడు,
మహమ్మద్ ఇలీకుతుబ్ శాహా.

మిత్రమా! అటులైన మీరు త్వరితముగఁ బోయి తీం
వలయును. ఆలస్యమొనరించుట తగదు. మాకుఁ గూడ నిచ్చ
టఁ జేయవలసిన కార్యము లేమియుఁ గనఁబడవు. మా రాజ్య

ము లేగతి పట్టినవో తెలియకున్నయది అందఱను వెళ్లవలసి
నదే మనమైత్రిని మఱువకుండునట్లు అప్పుడప్పుడు లేఖల వ్రా
యించుట మఱువవలదు.

కులీకుతుబ్‌శాహా—మంచిది పట్టణము రండు.

(నిష్క్రమింతురు)

# తృతీయరంగము.

ప్రవేశము:—తిరుమలరాయలు పెనుగొండ యందలి యారామమున నొంటరిమై దీర్ఘాలోచనఁ జేయుచుండును.

తిరు;—ఉ॥ చేసితి ఘోరమౌ ప్రతినఁ
జెల్లఁగ మ్లేచ్ఛమహీశబృందముల్
జేసిన దానిఁ దీర్పుటకుఁ
జేయఁదు మారు సహాయ మింత, నా
యాసముఁ జెందు నే ననిశ
నాతురతన్ గనుపింప నింక నే,
మోసముఁ జేసి నా పలుకుఁ
బూర్తి యొనర్పక దప్పెదా యె హా!

(యోజన నభినయించి) ఔరా! నా బుద్ధి యిట్టులఁ
బరిణమింప సాగె చిన్ననాఁటనుండియు మమ్ముల నతి గారా

జమున నాదరించిన వారిలోనీయన మూఁడవవాఁడు కదా. శ్రీకృష్ణభూపతి మా యన్న రామభూపాలునిపై నుండిన ప్రేమచేఁ దన పుత్రికారత్నము నాతని కొసంగి యుద్వాహ మొనరించె. అమ్మహిపాలుఁడు స్వర్గము నలంకరించిన పిమ్మట మా పెంకుడు మామగారగు అచ్యుతరాయల వారన్నతో మా యన్నగారికి సర్వాధికారముల నొసంగి యుండెను. ఇపుడీ సదాశివరాయులవారన్న నాయందధిక ప్రేమమును జూపి యాదరించుచున్నాఁడు. ఇట్టి మహాగుణ సంపన్నునికిఁ గీడుఁ జేయుటెట్లు. (నురల యోజించి) నే నాయన కపరాధము గావింపకున్న నే నొనరించిన ప్రతిజ్ఞ గొన్నటికిని నెఱవేఱఁబోదు. ఆయనకు నసురమన్నఁ జావు భయము. శపథమొనరించినది నేనుగాని యాయన కాదు గదా. చేసిన దానినిఁ గాపాడకొన వలసిన భారము నాది. ఆయన యనంతరము తురకలతోఁ గయ్యమునకుఁ బూనుకొని వారిని రూపుమాపి విజయనగర సామ్రాజ్యమును పూర్వపు స్థితికిం దెత్తమన్న 'పాపీచిరాయు' వను లోకోక్తి సార్థకము గావించుకొను చున్నాఁడు. మామగారి మరణమునకుఁ గాచుకొని యున్న వారికంటె ముందు నే మృత్యుముఖమునఁ బడిన నన్నియు విఫలమగును గదా ఔరా! చేసిన ప్రతిన తుదముట్టింపక గతించిన సద్గతులు గల్గునే, ఇన్ని కార్యము లొనరించిన దండులకా! అదెన్నటికిఁ గానివని.

చ॥ దినపతి స్థానముఁ విడిచి
దేశము లన్నిటిఁ జుట్టనేనియుఁ
దన చలనంబు మాని ధర
శాలిమితో నొక చోట నిల్చినఁ
దనువును దాల్చి నింగి తన
ధర్మముఁ దప్పి జరింపఁ బూనినఁ
మనమున నెంచినట్టిదగు
మాన్య ప్రతిజ్ఞను బాడొనర్తునే?

మహమ్మదీయుల మస్తకములఁ దెగ నఱకని యీ కృపాణమేల. హిందూ యువతీవతంసముల హింసఁబెట్టిన హీన కులజుల హింస నొందింపని యీ జన్మమేల. మహమ్మదీయ మతశాశినుల మేలి ముసుఁగులఁ దీయింప వలదా? మసీదుల మట్టిఁ గలప వలదా. మా విజయనగరసామ్రాజ్యమును రూపుమాపిన భామినీ సుల్తాను దుష్ట చతుష్టయ వంశనాశన మొనరింప వలదా? ఇట్టి మహాకార్యములఁ జేయవలసిన భారము నా తలపై నుండ వాని నన్నిటిని బోనాకి మామగారి యిష్టానుసారము నే నెటుల మెలంగఁ గలను. (యోజించి) నా శివుడొకటి స్ఫురించు చున్నది. మా సదాశివరాయుల నెటులనైన పంహరించి ఆ గద్దియపై నెక్కి స్వతంత్ర పాలనముఁ జేయుచుఁ బ్రథమమునమదీయ సోదరుఁడు రామరాజు నాశనమునకు మూల కారకుఁడగు గోలకొండ "కులీ కుతుబ్ శాహా" పుత్రుఁడగు మహమ్మద్ కులీ కుతుబ్ శాహాతోఁ బగఁ గల్పిం

చుకొని వాని వంశమును నిర్వంశముం గావించి తీరవలయు. తుర్కంగల సుల్తానుల సంగతి తర్వాత విచారింప వచ్చును. గోలకొండ సంస్థానమున నీచాధముండగు కులీ కుతుబ్ షాహ బ్రదుకుట వాని వంశమును రూపు మాపెదనని దృఢ ప్రతిజ్ఞఁ గావించితిని. వానిపైఁ గసిఁ దీర్చుకొందమన్న నవ్వుడే యము ని సదనమున కేగి యున్నాఁడు. ఇఁక వాని పుత్రునిఁ జంపి చెంపాటిక విడువరాదు కనుక ముందు మామను బరిమార్చి, సర్వాధికారములు నా యధీనముఁ గావించుకొని, పిమ్మట నా కోర్కెలసిద్ధిః నెఱవేర్చుకొనియెదఁ గాక! నేఁటిరాత్రి మా మామ నివసించి యున్నశాల హంతకులను బంపి హతమొన రించులాగునఁ జేసి నేఁగల్పిన కార్యము నిందార్హ మైనదని బ్రతిదినము పాత్రముగ భావించి తమ ప్రాణములనై న నిల్పుకొనక కార్యము నొనరించి నన్ను సంతోషితస్వాం తునిఁ జేయఁగల శూరులెవరో నే నేల యోజింపవలయు. నేనిప్పు డెవ్వ వారినిఁ బురికొల్పి పంపెదఁగాక!.

(నిష్క్రమించును.)



# చతుర్థరంగము

ప్రవేశము:—తిమ్మానాయుఁడు, కృష్ణప్పనాయుఁడు, తిమ్మప్పనాయుఁడు, ఆదెప్పనాయుఁడు, అను సామంత ప్రభువులు తిరుమలరాయుల ప్రత్యేక మందిరమునఁ గూర్చుండి యుందురు.

కృష్ణప్ప:—మిత్రులారా! తిరుమలరాయలు మనతో నేదియో ముఖ్యాంశము మాటాడవలసి యున్నదని పత్రములఁ బంపి రావించెను గదా. ఆయంశమిట్టిదని నాకుమాత్రము వ్రాసినవారు కారు మీలో నెవరికైన వ్రాసి యున్నారా?

తిమ్మా:—నాకుఁ గూడ వ్రాసి యుండలేదు.

తిమ్మప్ప:—నాకుఁ గూడ వివరములు వ్రాయలేదు

ఆదెప్ప:—నాకుఁ గూడ నంతియే కారణ మేమి యుండును?

తిమ్మా:—ఏదియో మహాకార్య ముండియుండును. తొరిక రమ్మని వ్రాసి యుండరు. రాత్రి ప్రొద్దు పోవుచున్నది. వారింకను రాకుండుటకుఁ గారణ మేమి.

కృష్ణప్ప:—ఏల తొందర పడ వలయును. రాయలవారు వచ్చు వేళ యైనది. కొంత యోపికతోఁ గూర్చుండుఁడు.

ప్రవేశము:

తిరుమలరాయలు రాఁగా అందఱు లేచి ఆయన కూర్చుండిన పిదపఁ గూర్చుందురు.

తిరుమల:—సామంతప్రభువులారా! నే నూరక మిమ్ముల రా

వించి యుండలేదు. అవసరమగు వంశమును గూర్చి మీ
కో రెూజింప వలసి యున్నది. తాళికోట రణావనిని భా
గనీ సుల్తాను శేకమై మోసముచే మన కెల్లరకుఁ బూజ
నీయుఁడగు రామభూపాలునిఁ దెగవేసి విజయనగరమును
గూల్చి, మా రాజ్యము నిచ్చటకి మార్చుకొనున
ట్లొనరించినది మీ కెల్లరకుఁ దెలిసిన విషయమే గదా.
వీనికన్నిటికిని మూలకారణము గోలకొండ సుల్తానేయను
యంశము మీకుఁ దెలిసియే యున్నది. ఇప్పుడద్దురాత్ముని
పౌత్రుఁడు మహమ్మద్ కులీ మన పెనుగొండను నాశనము
గావింపఁ గంకణముఁ గట్టుకొని యున్నాడని తెలియ వ
చ్చినది. యుద్ధమునకు సన్నద్ధుడగుచున్నాఁడఁట. మన
మూరక కూర్చున్న మన రాజ్యమును జయించి తన పా
దాక్రాంతులఁ జేసికొనక విడువఁడు. మహమ్మదీయుని
యడుగులకు మడుగులొత్తుటకు మీరు సమ్మతింతురా?

తిమ్మనా:—ఏమి. మహమ్మదీయుని యడుగులకు మడుగు
లొత్తుటయా. మన శౌర్యము లడుగంటెనా?

ఆదెప్ప:—మనము జీవించియుండ గోలకొండవారి మోస
కృత్యములు నెఱవేఱునా. ఈసారి యుద్ధమే తటస్థించిన
గోలకొండ మనస్వాధీనము కాకపోదు.

కృష్ణప్ప:—నాసీన జీవములున్న మహమ్మద్ కులీ మన సరి
హద్దులఁ ద్రొక్కఁ జాలఁడు.

తిమ్మప్ప:—ఈసారి తురకలు మనమీఁద దాడివెడలినచో

మన దుర్గమున కావలి చేయక విడువను. మీరు భయ
పడవలదు.

తిరుమల:—మిత్రులారా! మీ ధైర్య సాహసములకు మెచ్చితి
రణరంగమునఁ దురుష్క యోధులను జయించుటకు మ
నకు శక్తియున్నది కాని ప్రయోజనమేమి. సదాశివరాయ
లవారు యుద్ధమనిన గడగడ వడఁకుదురు. నేను యుద్ధమున
కు బురిగొల్పినను నామాట వినకున్నాఁడు. ఈతని ప్ర
భుత్వముననే మనమెల్లరము మహమ్మదీయుల బానిస
ము గావలసి వచ్చును. ఇఁక మన హిందూనారీజనము
లు బిబ్బీలు కాకతప్పదు.

తిమ్మా:—ఏమీ! సదాశివరాయలకు మాత్రము ఆత్మగౌర
వము లేదా? తన వంశమునకుఁ గళంకము దెచ్చునా? వి
జయనగర సామ్రాజ్యాధీశులకు జనింపఁడా?

తిరుమల:—జన్మించిన నేమి ప్రయోజనము.

క॥ కదనమునఁ దురక దొరలను
మదమడఁపఁగఁ బూనకొనఁడు మన మెదిరింపన్
బోదమని యెవ్విధిఁ జెప్పిన
నదియిప్పుడు వలదటంచు నాడుచునుండన్.

కనుక సదాశివరాయలు రాజ్యమునరించు నన్నిదినము
లు మన శౌర్యపరాక్రమములఁ జూపుటకు నదను లభింపఁ
బోదను వాసలుకుల నమ్ముఁడు.

కృష్ణ:—(తనలో) ఈయనకేదో దుష్టభావము మనమునందు

న్నటులున్నది. కాదిమ్ము. నాకీల (ప్రకాశముగా) అయి
న మన మేమి చేసిన బాగుండును.

అదప్ప:—సదాశివరాయుల పాలనము మన సంస్థానమునకె
ముప్పుదెచ్చునదిగా నున్నది. ఆయనను దొలగించు ను
పాయము లేదా.

తిరుమల:—(స్వగతము) వీరి సహితము నాకనుకూలముగనె
మాటాడుచున్నారు. ఇంకను జూచెదనుగాక.

తిమ్మప్ప:—రాజ్యమును గాపాడుకొనఁ దలఁచితిమేని అదె
ప్పనాయుఁడుగారు నుడివిన యంశమునుగూడ యోజింప
వలసిన దే.

తిరుమల:—అటులొనరించిన సదాశివరాయులవారి యనం
తరము సింహాసనము నలంకరించుటకుఁ దగినవారెవరు
గలరు.

తిమ్మా.—మీరుండ లేదా. మహమ్మదీయుల మర్కటముల
భంగి నాడించిన రామరాజుగారి సోదరులుగారా? మీ
యసమాన బలపరాక్రమ సంపన్నులను సంగతి రాయలవా
రికిఁ దెలియదా. ప్రజలు కనులుమూసుకొని యున్నారా?
మీరు రాజ్యమునకు వచ్చిన నన్నిటికి ననుకూలముగ
నుండును.

తిరుమల:—అయ్యో' ఆపదవి నాకువలదు. అటులొనరించినఁ
దిరుమలరాయులే రాజ్యము నపహరింపఁగోరి సామంతప్ర
భువులను లోఁబఱచుకొని సదాశివరాయులను బదభ్రష్టు

ని గావించెనను నపవాదము వాటిల్లును. అట్టి దుర్గతిము
ను నేభరింపఁజాల కనుక తిమ్మానాయఁడు నుడువు పలు
కులు నాకసమ్మతములుగా నున్నయవి.

కృష్ణప్ప:—ఇఁక వేఱొండు విధము గానఁబడదే.

తిరుమల:—కనఁబడకుండిన మనవిధి యిటులున్నదని భావిం
చి తురకలకు లోఁబడియే యుందము.

తిమ్మా:—ఆమాటలు నుచ్చరింపఁ దగినవి కావు మా
కుఁ గర్ణకఠోరములుగా నున్నవి.

ఆదెప్ప:—ఆపలుకులు ములుకులై నాఁటుచున్నవి.

తిమ్మప్ప:—మీరిట్టి కర్ణకఠోరపుఁ బలుకులఁ బలుకుట సముం
జసముగ లేదు.

తిరుమల:—విధిలేదు. నన్నేమి చేయుమందురు. (లోపల కల
కల ధ్వనిని వినుట నభినయించి) ఏమది లోపల ఘీఁకో
లువు నరపులు.

ప్రవేశము:

సేవకుఁడు ఆతురతతోఁ బరుగిడుచువచ్చును.

సేవకుఁడు-మహాప్రభూ! ఏమని చెప్పఁగలను. సదాశివరాయ
లవారు గాఢనిద్రా పరవశులైయుండ దురాత్ములెవరో హ
త్యఁగావించి పాఱిపోయిరి. గాఢాంధకారమై యుండినందున
వారిని గుర్తింపరైరి. ఒకటే కేకవేసి ప్రాణములఁ బాసెను.

తిరుమల— (అందఱు ఆ ఆ ఆ అని లేతురు) ఏమీ! ఏమీ!
(అని కరవాలమును సహితము పిడిచి, యెవరితోఁ జెప్పక

ఆతురతతో వెడలును. తక్కినవారు నివ్వెఱపడి యొకరిము ఖ మొకరు చూచుకొనుచు మెల్లగఁ గూర్చుందురు.)

కృష్ణప్ప:—మిత్రులారా! ఇదేమో ఆశ్చర్యముగ నున్నది. ఇందులకు కారణమెవ్వరై యుందురు.

ఆదెప్ప:—నా కేమియుఁ దోఁచ లేదు.

తిమ్మప్ప:—రాజద్రోహు లెవ్వరైనఁ బెనుగొండఁ జేరిరా.

కృష్ణప్ప:—మిత్రులారా! నా కొకటి స్ఫురించు చున్నయది. అందు నేఁబొరఁబడి యుండిన క్షమించుఁడు. నాకేమొ గాని తిరుమలరాయలపై ననుమానము జనించు చున్న యది. ఈయన యే మైనఁ గుట్రఁబన్ని యుండునా? లే కున్న నిట్టి నిశీథమునఁ బగిలెకు రాఁగలుగుదురా.

తిమ్మా:—ఏమయ్యా! యోజించక మాటలాడెదవు. ఆయ నయందు నా కేఁ కొంటి సంశయము లేదు. సత్యాసత్యము ల గ్రహింపక యితరులపై నింద మోపుటచే మన కేమి యు లాభము లభించదు సుమా—

కృష్ణ:—అట్లైన క్షమింపుఁడు, ఏమో నా యంతరాత్మ యట్లు సెలవిచ్చె. అయిన దానికి మన మేమి చేయఁగలము

ఆదెప్ప:—పికకి రాజు తెగినను రాజ్యమున కంత నష్టము గలుగదని నా మనవి.

తిమ్మా:—సెబాస్! బాగుగ సెలవిచ్చితిరి. ప్రజలకు ముప్పుఁ దెచ్చు రాజుండిననేమి మండిననేమి. ఇపుడు తిరుమలరా యులనే సింహాసనము నెక్కింతము. ఆయన తప్ప నితరు

లనర్హులు. ఇతరులు గోలకొండవారి సహాయింపఁ జాలరు.
ఇందు మీ యభిప్రాయ మేమి?

తిమ్మ:—సక్క_ము వచించితివి. నేనేకీభవించు చున్నాను.

కృష్ణ:-(స్వగతము) నేనిప్పుడేమన్నను నాయొక్క దు (ప్ర కాశముగా) నరి తిరుమలరాయలనే రాజుగా నొప్పుకొందము.

అదెప్ప:—ఇప్పటివారిలో ఆయనగాక యితరులెవ్వరును సిం హాసనమెక్క_ నర్హులు లేరని నృష్టముగఁ జెప్పఁగలను. ఆ యన వచ్చిన తోడనే యీసంగతి తెలుపుదము.

ప్రవేశము:—తిరుమలరాయలు

తిరుమల:—(వ్యసనముతోఁ బ్రవేశించి) మిత్రులారా! మా మగారి కప్పుడే శిరవ్రణములు నిండెనుగదా. ఏమరాయ్మిఁ డీకార్య మొనరించెనో బొత్తిగఁ దెలియకపోయెనే. ఇం చుక దెలిసియుండిన వారిని బరిమార్చి శమనపురికిఁ బంపి యుండుము కదా? ఇఁకఁ బెనుగొండ రాజ్య మంత్యము గు కాలము సమీపించెనని తోఁచెడిని.

తిమ్మ:—మీరు చింతించుటవలనఁ బ్రయోజనము లేదు. చింతించి వారిని బునర్జీవితులఁ గావింపఁజాలరుగదా. ముం దు జరుగవలసిన రాజకీయ విషయములఁగూర్చి యోచిం చుఁడు. మేమందఱము మిమ్ము సింహాసనముపైఁ గూ ర్చుండఁ బెట్టఁదలఁచినారము. పెనుగొండ రాజ్యము మ్లే చ్ఛులవాతఁ బడనీక కాపాడుభారము మీది.

తిరుమల:—మీ పుణ్యమగును. ఆపదవి నాకంటఁగట్టకుఁడు.

ఆదెప్ప:—మీ రేమైన ననుఁడు. మీకుఁ దప్పినది కాదు. ఇప్ప టికి గాత్రియై చాలకాలమైనది. మాకు సెలవొసంగిన చో వేకువజామున నే బయలుదేరి మాపట్టణములకు వెళ్లెదము.

తిరుమల:—కానిండు. కంఠమునఁ బడిన త్రాఁచు కఱవక తప్పదను భంగి మీ కోరిక ప్రకారమే కానిండు. మామగారికి సంస్కారక్రియలఁ గావించి తదుపరి రాజకీయ విషయములఁ జర్చింతము. గోలకొండ వారివిషయమై యోజించి మీకుఁ దెలిపెద. మీ దేశములకు వెళ్లవచ్చును. (చిత్తమని అందఱు నిష్క్రమింతురు.)

సెబాస్! కార్యసాధకుఁడన్న నేను దక్క వేఱొకఁ డుండునే. ఔరా! నా సాహసము ఇందరికంట మట్టి గొట్టి నా కార్యమును గొనసాగించితిని గదా. నా కుటిలవర్తనము నెవ్వరికిఁ దెలియకుండఁ జేయఁ గలిగితిని. కృష్ణప్పనాయుఁడు మాత్ర మొకింత యనుమానించినటులఁ గనఁబడియెను గాని మరల నా దారికే వచ్చెను. వీరితోఁ గూడఁ గల్పించుకొన రాదని వారికి దగినట్లు నటించినందునఁ గదా నన్ను విశ్వసించిరి. కనుక

తే॥గీ॥ మంచిమాటల చేత నే-మనుజు నైన
విషముఁ ద్రావింప వచ్చును-వెరవుతోడ
పాలఁ గ్రోలంగఁ జేయను-వీలు గాదు
పనుల సాధించు వారిది-మరువ రాదు.

ఇప్పుడు కదా పెనుగొండ రాజ్యలక్ష్మి నన్ను వరింపఁ గలిగె. ఇంతటి నుండి నా మాట వేదవాక్యముగ జరిపించెద గాక. తొలుత గోలకొండ వారితోఁ బోరొనరించుటకుఁ దగిన సైన్యమును గూర్చెద. తాళికోట యుద్ధమున మిగిలిన గజములు కొన్ని యున్నవి. ఇక నశ్వములు విక్రయించుటకు వచ్చిన పోర్చుగీసు వర్తకులనుండి యశ్వ సమూహములఁ గొనియెద. తదుపరి మహమ్మదీయులను నా యిచ్చవచ్చినటుల భంగపఱచి గోలకొండ వంశమును నిర్మూలము గావించెద. ఓరి! గోలకొండ సుల్తానా!

చ॥ జవరమునందు నీ జనకు
ప్రాణములన్ దగఁ గొందునంచు, నా
యవనుఁడు దీటె నేనియును
నాతని వంశము నూపుమాప కీ
యవని జరింప నే ననుచు
నాడితి నాఁడిక నిన్నుఁ గూల్చెదన్
జవరమునందు దిక్కెవరు
బాగుగఁ జూడుము చూచెదన్ ఖలా॥

(నిష్క్రమించును)



శ్రీ రస్తు.

# గండికోట పతనము

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

(ప్రదేశము:— గోలకొండ సుల్తాను దర్బారు. మహమ్మదుకులీ కుతుబ్ శాహా, అతని ప్రధాన మంత్రియుఁ గూర్చుండి యుందురు.

మహమ్మదుకులీ.— మంత్రి సత్తమా! హిందువుల నెన్నటికి విశ్వసింప రాదు గదా! నా జనకునితో నే నెంత నొక్కి చెప్పినను నా పలుకుల యందలి గూఢార్థమును గ్రహింపలేక యీ దుష్టబుద్ధి యగు మురారిరావునకు మిమ్ములఁ బో ద్రోసి ముఖ్య మంత్రిత్వము నొసంగెను. అంతటితో నూరకున్న నొక్కింత బాగుగనుండెడిది. దానితోఁ బోనియక తాను విజయనగర రాజ్యమును సూపుమాపఁ దలఁచి తాళికోట సంగరమున కేగుచు తాను మరలి వచ్చువఱకు మన రాజ్యమును ఆ నీచుని స్వాధీనము చేసి పోయెను. పుత్రుఁడను మీఁదు మిక్కిలి రాజ్యమున కర్హుఁడనగు నన్ను దలంప నైనఁ దలంపక, ముక్కుటముగ నన్ను పోయినందులకుఁ బాలించిన ప్రభునకు మన్నించి

యధికార మొసంగిన దాత యనక స్వామిద్రోహియై
ముసల్మాను ప్రభుత్వమును ముంచివేయుటకుఁ బ్రయ
త్నించెను గదా.

ప్ర. మంత్రి:—సర్కార్! నేను మాత్ర మూరకుంటినా. నీ
జనకునికి హిందువులతోడి చెలిమి అగ్నితోడి మైత్రియ
నియు పాముతోడి బాంధవ్య మనియు నొక్కి చెప్పితిని.
నా పలుకు లాలకింపఁడయ్యె. నేను మురారిరావుపై య
సూయ చేతను అతని పదవికి రాఁగోరి వ్యతిరిక్తముగఁ బ
లుకు చున్నానని కోపవశుఁడయెను. వాడెంతయైన హిందు
వుఁడుకదా! నీ తండ్రి హిందూ రాజ్య నాశనమున కేగ
మురారిరావు ముసల్మాను రాజ్యమును ముంచఁ దలఁచె
ను. ఇందు మీతండ్రి యవివేకమేకాని వాని తప్పేమి
యు లేదు. ఎప్పటికైనను హిందువు లంతయొక్కటియని
భావింపక రాజ్య మాతని స్వాధీనముఁ జేయవచ్చునా?
తాను కేవలము మత కలహమునకుఁ బోవును బరమత
స్థుని నమ్మవచ్చునా? ఎన్నటికైనను హిందువులందరొక్క
టియనియు వారి యైకమత్య మితరులకు రాదనియు బా
గుగ నమ్ముఁడు.

మహమ్మద్:—వజీర్! నీ విందు పొరపాటు పడితివి. ఇప్పుడు
వారి యైకమత్య మహాలక్ష్మి, విజయనగర భాగ్యలక్ష్మి
తోపాటు వచ్చి మనలఁ జేరినది. లేకున్న ముల్లోకముల
లోఁ బ్రతిభఁ గాంచిన విజయనగరమును సాధించుటకు

మనవారిచేత నగునా? హిందువు లిప్పుడు సంఘీభావము
నే గలిగియున్న భారత దేశమందలి మహమ్మదీయ రా
జ్యములే గాక పరరాజ్యములన్నియుఁ గలిసి వచ్చినను
వారిని జెనకఁ జాలరని నిర్భయముగఁ జెప్పఁ గలను. ఇది
నిష్పక్షపాతముగఁ జెప్పెడి వాక్యము. మన కదృష్టము
బాగుగనుండబట్టియే హిందూనృపాలురు సన్నగిలు చు
న్నారు నేను మా తండ్రిగారికి మురారిరావు చర్యలు
లేఖలో వ్రాసి పంపకుండిన మన రాజ్యము కూడ నమసి
యుండును. మంత్రిశేఖరా! ఆ విగ్రహారాధకుఁడెంత ధ
న మపహరించెను. ఎందఱి కొంపలఁ గూల్చెను. వాని
చర్యలు నా కిప్పటికిని మరపు రాకుండుటయే గాక భీతిఁ
గొలుపు చున్నవి సుమా.

వ్రి మం—మహారాజ్! అంతయె కాదు. వయసు జెల్లిన మీ
జనకుని యకాల మరణమునకు వాఁడే ముఖ్య కారకుఁడు.
పాపము పాదుషాగారు ధనమంతయు మురారిరావు దోఁ
చుకొని పోయినందున మరల నంత ధనము నెటుల సంపా
దింపవలెనను దిగులు చేతనె, మృత్యు ముఖమునఁ బడిరి.

మహమ్మద్:-సత్యము. అది నాకుఁగూడ బాగుగఁ దెలియును.

ప్ర మం—ఇపుడా దురాత్ముఁడు పాఱిపోయెను. వృద్ధుఁడగు
మీ తండ్రియుఁ గతించెను. ఇఁక మీరు నిర్భయముగ రా
జ్యపాలనముఁ జేయవచ్చునుగదా. మీ కత్తి కష్టము వచ్చు
వారికిఁ గానఁబడును.

మహమ్మద్—సచివాగ్రణీ! నీకుఁ దెలియక మానుచున్నా
వు. ఇంతకాలము నాజనకుఁడుండ నేభీతియు లేక కాల
ము గడపితిని. నాజనకుఁడు ప్రాణములఁ బాయుచు నా
కొక సంగతిఁ జెప్పి దానిని మరువకుమనిరి.

ప్ర మం:—ఏమీ! ఏమాసంగతి. అంత దారుణవృత్తాం
తమా?

మహమ్మద్—నిక్కముగ భయంకరపు వార్తయే.

ప్ర మం:—అది రహస్యమా.

మహమ్మ:—రహస్యమేమియుఁ గాదు. నీతోఁ జెప్పవలసిన
సంగతియే. గోల్కొండ సమరమున రామరాజు తలఁ దెగ
వ్రేసిన పిమ్మట అతని తమ్ముఁడు తిరుమలరాయలు మా
తండ్రిని జూచి విజయనగర వినాశకుఁడవగు నీ కుటుంబ
మా వంశమును [illegible] ఘోరప్రతిజ్ఞఁ
జేసి యున్నాఁడఁట. తిరుమలరాయలు సామాన్యుఁడు గాఁ
డఁట. చెప్పినదానిని కార్యరూపమునఁ జేసి చూపకవిడు
చువాఁడు కాఁడఁట. తిరుమలరాయలు నీప్రక్కలోని బల్లె
మునుమా. జాగ్రత్తగా మెలంగుచుండుటయె గాక వానిని
మట్టుపెట్టక విడువకుమని చెప్పి ప్రాణముల విడిచెను.

ప్ర మం:—ఆఁ ఆఁ (అని తలయూఁచి) అట్లైన మనము తగి
న సైన్యమును గూర్చుకొని పోవుటకు సంసిద్ధులమై యుం
డవలసినదే. ఆ బద్మాష్ ఎపుడు వచ్చునో యెవరికెఱుక.
వాఁడిప్పుడు మనకు లోఁబడి యుండలేదా.

మహమ్మద్:— కాదు. కాదు. అతనికి మనమే లోఁబడి యు
న్నామని యాతని తలంపఁట. మనపై దన యధికారము
ను చలాయింప వలెనని తగిన ప్రయత్నములఁ జేయు
చున్నాఁడఁట.

ప్ర. మం:— ఎవరి కెవరు లోఁబడియుందురో తెలిసికొనఁ గ
లఁడు. రామరాజే మన కాహుతియై యుండ వీఁడేమి చే
యఁ గలఁడు. మీరు భయపడఁ బనిలేదు.

మహమ్మద్:— మంత్రివరా! ఊరకఁ బరాక్రమములఁ బలు
కుట వలనఁ బ్రయోజనమేమి. మనము కత్తిఁ గట్టఁ బో
వునది రామభూపాలుని సోదరుఁడగు తిరుమలరాయలతో
నని యెంచుము. జరుగఁబోవునది ఘోరప్రతిజ్ఞలఁ జేసి క
సిఁ దీర్చుకొను తలంపునఁ గట్టుకలతో జరుప నిశ్చయిం
చిన దినము. నీవు వాని నల్పెంతయని తృణప్రాయముగ
జమ్మువై మనబలముఁ బలికెదవు.

ప్ర. మం:— సర్కార్! అంతమాత్రము తెలియఁ జాలనా.

మహమ్మద్:— ఇప్పుడు యుద్ధము తటస్థించినచో మనకుఁ దగి
న సైన్యము లేదు. గజ, తురగ పదాతులను, ధనసమూహ
మును తాళికోట సమరము మ్రింగి వైచినది. మనమిప్పు
డు క్రొత్త సైన్యమును గూర్పక యూరకుండ రాదు. ఇది
యటులుండ నాకింకొకటి తోఁచు చున్నయది మనము
బిజపూరు నవాబును సహాయము గోరిన బాగుగనుండదా

ప్ర. మం:— కోరవచ్చును గాని మనము బలహీనులుగ ను

న్నామనుసంగతి బిజపూరు వారికిఁ దెలిసినచో ముందు
వారే మనపైకి యుద్ధమునకు వచ్చి జయించిన నేమి చే
యఁగలము. భూపాలురకెవ్వరును పరరాజ్యములను జ
యించి తమ యధీనము చేసికొనవలెనను నాశయే గాని
వేఱు లేదు. వారికి మిత్రుఁడును బంధువుఁడును లేఁడు.
సమయము వచ్చిన నిరువురకును ద్రోహము చేయుటకు
వెనుకంజ వేయరు. కనుక మన బలహీనతను వారికిఁ గ
నఁబఱుపరాదు.

మహమ్మ:—(ఇంచుక యోజించి) అయిన నాకొకటి తోఁచు
చున్నది. బిజపూరు నవాబగు రెండవ యిబ్రహీం ఎదిల్
షాకు నాచెల్లెలి నొసంగి పరిణయము గావించెదను. నా
తండ్రిగారు కూడ నాసోదరిని అతనికే యియ్యనెంచి
యుత్తర ప్రత్యుత్తరములు జరపి యుండెను. బిజాపూరు
వారు గూడ తల యూపి యుండిరఁట. ఈరీతిగా బంధు
త్వమును గల్పించుకొనిన యుద్ధము తటస్థించినచో
వారికై వారే మనకు సహాయముఁ జేయ వత్తురు. ఏమి
ఇది బాగుండ లేదా.

ప్ర. మం:—బహుబాగుగ నున్నది. ఆలస్యము చేయక యీ
కార్యమును ముగించ వలయును.

మహమ్మ:—అట్లైన నా తండ్రిగారి కోరిక ననుసరించి నాసహో
దరి వివాహము జరిగింప సంసిద్ధులమై యున్నామనియు
వెంటనే వచ్చి పరిణయము గావించుకొని వెళ్ళవలెననియు

బజాపూరువారికి జాబువ్రాసి పంపుము.

ద్వి మం.—చిత్తము.

(నిష్క్రమింతురు)



# ద్వి తీ య ర ం గ ము

ప్రవేశము:—పెనుగొండ యంగడి యంగడి వీధిలో బాబయ్య వుగానుకు విచ్చేసిన నానాదేశ మహమ్మదీయ సమూహము నానావిధ భిక్షుకుల గడబిడలో తిరుమలరాయలు మారు వేసముతో నొక సేవకుని వెంటనిడుకొని తిరుగుచుండును.

తి. రాయల—(స్వగతము) ఔరా! మహమ్మదీయుల దౌర్జన్యము. హిందూరాజ్యమున నదమయుత్సవములు జరుగుచుండ హిందూ మంగళవాద్యముల వాయించరాదట. శుభకార్యములం జేసికొనరాదట. పరదేశమునుండి మా దేశమునకువచ్చి మావాద్యముల కంతరాయము గలిగించువారా? ఈ దినము ప్రత్యక్షముగ నీ యూరునులో మహమ్మదీయుల దౌర్జన్యములం బరికించెద. ఈ పచ్చితురకల యాటలెటుల సాగినచ్చునో చూచెదంగాక. (అని యొదిగి యుండును.)

ప్రవేశము:—

భిక్షుకుడు కావిగుడ్డల ధరించి యేకనాదము చేతఁబట్టుకొని తత్వముఁ బాడుచు వచ్చును.

భిక్షుకుడు:— తత్వము.

మాయలోపలఁ బుట్టి-మాయలోపలఁ బెరిగి
మాయమై పొయ్యేవు మనసా!
మాయ మర్మము తెలిసి మహిని జయించితే
సద్గతులు గలుగునో మనసా. ౧

ఇల్లు వాకిలి నాది-యిల్లాలు నాదనుచు
మిట్టిపడి యెద విలను మనసా!
ఇల్లు వాకిలిరాదు యిల్లాలు మరిరాదు
మట్టిలోఁ గలతువో మనసా. ౨

పరభామలను జూచి-భ్రాంతిచేఁ గుందేవు
పాపమని తెలియకను మనసా!
పరభామినుల గోర పగులు నీకాంతను
భ్రష్టింపఁ జేతురో మనసా. ౩

(అని పాడుచు నిష్క్రమించును)

ప్రవేశము.

రామోజీ లక్ష్మోజీ అను బుడబుడుక్కలవారు.

లక్ష్మోజీ—అంబరావె జగదంబారావె-మలయాళపు మహాంకాళీ రావె (రామోజీ చెప్పు ప్రతిచరణమునకును లక్ష్మోజీ తన చరణమును పల్లవిగాఁ జెప్పుచుండవలయును.]

సావోజీ:—

అంబావల్కు తదివినండిసామి

మారిచెప్పెగి మాటలజెప్త

జయము జయము జయమానూసామి

జయము గల్గుతదివినండి దేవరా

ఆదివారము అమాసనాడు

పరమటి దావపట్టకురాజా

ఆగ నెల్లకు ఆకటసామి

అధికారము నీకొచ్చును దేవరా

చూచి యోర్వనీ పగవారున్నరు

భయముజెందకు మనసునరాజా

మంచిమాటలతో మోసముజేస్తరు

నమ్మవాకు మరి నమ్మకు సామీ.

మూలనయున్నమునలిది చస్తే

ముంతెడు మాడలు దొరకును రాజా

మేడమీద బల్ మేకలు గడ్తవు

రాముని మాట తప్పదు దేవరా

కానివానికిర్ కష్టపెడ్తరు

కష్టమె సుకముగ నూర్తది సామీ

ఆడవారిని నమ్మకు నమ్మితె

అగుడుజెందెదవు తప్పక రాజా

స్త్రీకి రహస్యం చెప్పకుసామీ

చెప్పి తెబయటాకొ స్తని దేవరా
చెమటమాగిన వస్త్రము కాలువొ
పాదకు చేస్తే తలు స్తనాదిా
యేండాదికి వకసారి తలుస్తా
మళ్ళీనస్త మన్నించుము రాజా.

(నిష్క్రమింతురు)

పునః ప్రవేశము:—

మొదటి భిక్షుకుఁడు తత్వము పాడుచు వచ్చును.

కూ్రరమానిసివగుచు-క్రోధంబుఁగల్పించి
కుత్తుకలఁ దరిగేవు మనసా!
కాటికేగినతరి కాలుఁడు నికాబట్టి
శూలాలఁ బొడచునో మనసా! ౧.
ఆలి మాటలవినీ-యన్నదమ్ములఁ జూసి
అమ్మనూ దిట్టేవు మనసా!
ఆపదలు కలుగుచో అన్నదమ్ములె దిక్కు
ఆలునిజూడదో మనసా! ౨
కలియుగంబున నీవు-కామాంధకారంపు
కడలిలోఁ జిక్కితివి మనసా!
కష్టంబు లీడేర కరుణానసముద్రుని
మనసారఁ దలఁపుమో మనసా! ౩.

ప్రవేశము:—రసూల్ అను మహమ్మదీయుఁడు
తాగి తూఁగుచు వచ్చును.

రసూల్:—అరే! ఖాంచో! ఏమిారా! మాదీ పురుసూమే

మీాది చేపుడ్కీ పాటా పాడ్‌తాయ్. సూవ్వర్! మాకీమా
ట నీకితెల్వదూ (అని యొక తన్నుతన్ని యేకనాదమును
జగలగొట్టి పోవుచుండ)

భిక్షుకుఁడు:—అయ్యో! సామీా! సామీా! చంపెను చంపె
ను. (అని యేడ్చుచు నిష్క్రమించును.)

తిరుమల:—(కోపముతో స్వగతముగ) ఓరా! ఇద్దురాత్ముల
దౌర్జన్యము. నారాజ్యమునఁ దురుష్కులు తమ చర్యల
నింకను సాగించుచున్నారా! (తురకను చెవిఁబట్టి యీా
డ్చుచు) ఒరీ! తురక విధనా! తప్పఁద్రావిన చండాలా! హ
రినామస్మరణ మొనరించు యాచకుఁడు నిన్నేమనకుండి
నను పైఁబడి తన్నితివా? నీ పచ్చిరక్తమును గుక్కలచేఁ
ద్రావించెద. అటులొనరించినగాని మీా జాతికి తెలివి
రాదు. (సేవకుని జూచి) ఓరీ! వీనిఁ గొంపోయి భటుల
కప్పగించి వృక్షమునకుఁ దలక్రిందుగ ద్రేలఁ గట్టి యీాఁ
టితోఁ గ్రుచ్చి కారెడు రక్తమును శునకములచేఁ ద్రా
వింపు మనుము. ఇది నా చండశాసనము. పొమ్ము
త్వరగారమ్ము.

రసూల్:—అరే! అల్లా! చుప్‌కే మర్గయారే బాబా! (అని
యేడ్చుచుండును.

సేవకు:—నడువుము. (అని మెడఁబట్టి లోపలఁ ద్రోసి మరల
బూర్వపు స్థలమున నొదిగి యుండును.)

తిరుమల:—ఇంకను వీరి చర్యలఁ బరికించెద (అని మరల

కొదిగి యుండును.)

ప్రవేశము:—నూర్‌ఖాఁ అల్లాసాబ్ అను యిరువురు ఫకీర్లు దహారాల వాయించుచుఁ బ్రవేశింతురు.

హిందీ.

ఈశ్వర్ సేతే వరం ధన్నాసుర్ క్యాహై బద్నాని।
యీశ్వర్‌కు హి ధనంకి క్యే రాజా హైహ్ఞానీ
ఓ యీశ్వర్ భాగా లేమానీపాలువాహై కహిజా పీఠ పాని
వరందే భాగా కెంజానీ యొహిందు కర్‌తే బద్నాని
యీశ్వర్‌కు హి పాలుదాకహితే హిందూ బద్‌హ్ఞాని
బ్రాహ్మణ్ యజ్ఞం కరేజి జీవాహాత్ నరక్ కహేతేజి
ఫేతేల ధనము కర్తేజి ఓ బాక్‌కు చాబకే ఖాతేతి
హిందులోగ్ మె కహాఁ ధరం హై కర్తే బద్నాని

తిరు:—(నడాలున వారిపైఁ బడి దహారాలఁ జీరులఁ గొట్టి)
చీ. నోరు మూయుఁడు మాటాడిన మీ నాలుకలఁ గోయించెద. మా రాజ్యమున మునల్మానులీరీతి పాడఁగూడదను సంగతి మీకుఁ దెలియదా? మిమ్ము నింతటితోఁ బోనియ్యరాదు (సేవకుని జూచి) ఓరీ! వీరిని మెడబట్టి త్రోసికొని వెళ్లి యుక్కుతంతెల గుఱ్ఱపు కొఱడాలతో వీపు వాయునటులఁ గొట్టించి యెవరితోఁ జెప్పికొందురో పొమ్మని మరల రమ్ము

సేవకుడు:—భాగ్యము. (అని వారిని లోపలికి మెడఁబట్టి త్రోయుచుఁ దీసికొని పోయి వచ్చి మరఁ దన స్థలమున నో

దిగియుండును. ఫకీరులు అల్లా అల్లా అని దుఃఖించుచుం బోదురు.)

ఈనను:—ఇంకను ముసల్మానుల యాగడములను జూడవల యును. ఇందే దాఁగి యుండెద. అని పూర్వపు స్థలమున నొదిగి యుండును)

(ప్రవేశము:—సుబ్బాజీ సిద్ధోజీ అను జంగముకథఁ జెప్పువారు వారి వాయిద్యములతోఁ బ్రవేశింతురు.

సుబ్బ:—తందాన తందాన తందనానే తందాన తాన.

(ఈచరణమును సుబ్బాజి ప్రతివారి పల్లవిగాఁ జెప్పుచుండును)

సిద్ధోజి—ఓకొండుకా! ఓకొండుకా! ఓరామభూపాలా ॥తం॥

ఎక్కడికిఁబోతివో యెందుఁబోతివో తెలియదు నాతండ్రీ

పుత్రశోకమున ముంచిపోతివి కొడుక రామరాజా ॥తం॥

ఈతీగన దుఃఖపోనది కొడుకా భరతమాతా ॥తం॥

గోడుగోడున దుఃఖపోతది తల్లి భరతమాతా ॥తం॥

పరుల చేతికిఁ బట్టియిస్తివి పుత్ర రామరాజా ॥తం॥

దేశమున్నిటి నేలుచుంటిని దేశమాతనగుచూ ॥తం॥

యవనుల చేతఁ బెట్టి పోతివి యేమిసేతు కొడుకా ॥తం॥

వీరమాతనగు నేను జిక్కితిని వీరి చేతులోనా ॥తం॥

మేదిని నేలి మ్లేచ్ఛుల వాత నేను బడెనె నాయె ॥తం॥

ప్రవేశము:—గులాబ్ మహాల్ అను మహమ్మదీయ యువతి.

గులాబ్:—(వచ్చుచు త్వరితగతి నభినయించి) ఓసీ! నిలువుం డు నిలువుఁడు. ఈ కథా భాగము బాగుగనుండ లేదు.

మా నవాబులు యుద్ధము. రణమున రామరాజు తుదఁ దటి
గిన భాగమును మాత్రము చెప్పుడు. తక్కిన కథ చెప్ప
కుఁడు. మేము వినరాదు.

సిద్దోజీ:—అమ్మ! ఏల వినరాదు.

గులాబ్:—అవును. మేము వినరాదు. ఆ దురాత్ముఁడు మ
హమ్మదీయ మానినుల భంగపఱచి యున్నాడు. వాని
మరణ వార్తను మాత్రము విని సంతసించెదను. కానిం
డు. మంచి బహుమానమిత్తును.

తిగు:—[స్వగతము] ఔరా! ఈబయకారి పట్టుఁగల [వండ్లు
గీటి తలయూచుచు] మాయన్న రామభూపాలుని మరణ
వార్త విందువా కానిమ్ము చూచెద.

సుబ్బా:—తందాన తందాన తందనానే తందాన తాన

సిద్దో:—నవాబులందఱుఁ గలిసికొన్నరు రామరాజుపైకి తం॥
ఏనుఁగులూ గుఱ్ఱాలతోడను యేగుదెంచినారు ॥తం॥
తాళికోటలోఁ దారసిల్లెను నవాబుసైన్యములు ॥తం॥
తురకలు వచ్చిన సంగతి తెలిసెను రామరాజుకపుడు ॥తం॥
తిరుమలరాయుల వేంకటాద్రిని రామరాజు పిలిచీ ॥తం॥
వినండి మీరు వినండి మీరు ప్రియసోదరులారా ॥తం॥
పగవారొచ్చీ పాదుకొన్నరు తాళికోటలోన ॥తం॥
మతకలహమునకు వచ్చియున్నరు మహమ్మదీయులు ॥తం॥
మోసముఁజేసి ముట్టడింతురు విజయనగరమూను ॥తం॥
కన్నులుమూమకఁ గూరుచున్నను కష్టములొచ్చూను తం॥

చెయ్యండిమీరు చెయ్యండిమీరు కనకరంగమునకు ।తం।
చెయుమన్నంతనె లేచినారుగా సోకులిద్దారు ।తం।
గిరగిర గిరగిర మీసముదిద్దెను తిరుమలరాయాలు ।తం।
పటపట పటపట పండ్లుగీటెను వేంకటాద్రి యపుడు ।తం।
కన్నుల నిప్పులు రాల్చుచుండెను తిరుమలరాయాలు తం।
సైన్యముతోడను బయలుదేరెను రామనృపాలుండు తం।
రణము రణము రణమంటు మ్రోగెను రణభేరిముందు తం।
కాలికొమ్ములు కంచుతప్పెటలు మ్రోగించినారు తం।
యుద్ధభూమినీ చేరినారుగా రామరాజదండూ తం।
తురకల దండును జూచినాదిగా రామరాజదండూ తం।
యుద్ధమునకుతా సిద్ధమాయెను రాజరామరాజు తం।
తురకలమీదను తగులుపడినది రామరాజదండు తం।

తురకలప్పుడు జూచిరి తానా తందన తాన
ఉటోఉటో మన్నారు ,,
చలోచలో మన్నారు ,,
మారోమారో మన్నారు ,,
హిందుపూలు జూచిరి ,,
కొట్టుకొట్టు మన్నారు ,,
ఈటెలాను దీసికోని ,,
పీపునల్లా బాదిచేది ,,
అరబ్బూలు బట్టుకోని ,,
అరవకుండా గొట్టేరి ,,

రోహిలీలఁ బట్టుకోని తాన తందన తాన
రొమ్ములిరగ బొడిచేది ,,
కుడిప్రక్కన తిరుమల్ రాజు ,,
యెడమ ప్రక్కన వెంకటాద్రి ,,
నట్టనడుమ రామరాజు ,,
నఱకమనుచుఁ జెప్పి నాడు ,,
నఱుకుతూ వెళ్లినారు ,,
గోలకొండ సైన్యమూను ,,
గొంతులుబట్టి గోసీరి ,,
బిజపూరు దండూను ,,
పిండిరేగఁ గొట్టిరి ,,
గడ్డమూలఁ బట్టుకోని ,,
ఊచి వూచి కొట్టిరి ,,
తురకదండూ వచ్చింది ,,
హిందువూలఁ జుట్టుకోని ,,
తరిమి తరిమి కొట్టిరి ,,
జుట్టూడఁ బెరికిరి ,,
రామరాజు చూచాను ,,
అధిక కోప మెచ్చింది ,,
దూరి నఱుకు చున్నాడు ,,
హిందువూలు చెలరేగి ,,
దోసకాయల నఱికినట్లు ,,

తెలుకులాను నలికినట్లు   తాన తందన తాన
నలకుమూలబోయినారు   ,,
ఒకని మీద ఒకనివేసి   ,,
బాకులాతో గృమ్మిరి   ,,
తురకదండు తాళలేక   ,,
పారిపోఁ జొచ్చిరి.   ,,

పరుగిడు వారిని కన్నులఁ జూచెను రాజు రామరాజు తం।
నిలండి మీరు నిలండి మీరు హిందూ సైనికులూ తం।
పాఱిపొయ్యేటి వారిని మనము బట్టి కొట్టరాదు తం।
నిలు మన్నంతనె నిలిచిపోయిరి సిపాయి లందాఱు తం।
నిలిచిన సంగతిఁ దెలిసికొన్నది పారసీక దండు తం।
మందు గుండుతో బయలుదేరెను పారసీక దండూ తం।
పెళపెళ పెళపెళఁ బేల్చినారుగా పిరంగు లప్పుడూ తం।
పిరంగి శబ్దము వీనుల బడెను రామరాజు కపుడు తం।
దండును జూచి సైగలు జేసె రామనృపాలుండు తం।
పెట్టని దినములు కలసి నచ్చెను రామరాజు కపుడు తం।

రామరాజు సైగఁ జూచి   తానా తందన తాన
దండు అట్టె లేచింది   ,,
రేచుకుక్క లారీతి   ,,
పులివిల్లా లారీతి   ,,
తురకలాను దఱుమనెంచి   ,,
పరుగిడా జొచ్చిరి   ,,

వెంకటాద్రి దూఁమేగ తానా తందన తాన
తిరుమల్‌రాజు దగ్గర్ లేదు ,,
రామరాజు వల్లిలో ,,
కూర్చుండి యుండి నపుడు ,,
యెమరీ యున్నపుడు ,,
పారసీకులు తగులు వడిరి ,,
రామరాజును బట్టుకొని ,,
నవాబు దగ్గరికి ,,
తీసుకొని పోయినారు ,,
నవాబు చూచినాడు ,,
పటపట పండ్లు గీటి ,,
తలఁదఱుగు మన్నాడు ,,
తలఁదఱుగు మన్నంత ,,
ఇరగఁ దీసి గొంతుఁ గోసి ,,
ఈఁటె కపుడు గ్రుచి దాకిని ,,
పైకెత్త హిందువులు ,,
చూచి పరుగెత్తిరి. ,,

గులాబ్:—సెబాస్. చాలును చాలును. బహుమానము దీసి కొని వెళ్లుఁడు. (అని రూపాయి నియ్యఁగా వారు నిష్క్రమింతురు.)

తిరుమల:—(అంతవఱకుఁ బంట్లు గీటుచు, మీసము దిద్దుచు, కోపముతో దల యూచు చుండి కథఁ జెప్పువారు వెళ్లిన

నోపనే ఒక్క యొరుగున గులాబ్ మహల్ పై బడి చేతిని
బట్టుకొని ముసుఁగుఁ దీసి బయటకారీ! ఏమంటివి. రామ
రాజగారి మరణవార్త విని సంతసించెద నంటివా? పెను
గొండను పాలించునది రామరాజు సోదరుఁడగు తిరుమల
రాయలని తెలియదా. అంత నిర్భయముగ మాటలాడె
దవా. హిందూ నృపాలురన్న నీకంత లక్ష్యము లేక పో
యెనా? అ నాఁడు మదీయ సోదరుఁడు ముదగల్లు నవాబు
కూతురి ముసుఁగుఁ దీయించెను. నేఁడు నేను నా స్వహస్త
ముతో నీ మేలి ముసుఁగుఁ దీసితిని. ఇపుడు నిన్నవమ
రించిన యొవ్వఁడ్డు వడఁగలఁడు. అబలవు కాఁబట్టి నిన్నేమి
యుఁ జేయక విడువ వలసి వచ్చెను. (అర్ధోక్తి)

గులాబ్:—ఓరీ! చేయవలసినంతఁ జేసితివి. ఇంతకంటె నె
క్కుడుగఁ జేయఁ జాలవు. ఎక్కువ యన్న నీకు నా ప్రా
ణములఁ దీయఁగలవు కదా. మానమే తీసితివి. ఇఁకఁ
బ్రాణమేల. నాకుఁ బ్రాణము లెక్కలోఁ జేరినది కా
దని నమ్ముము. ఇదే నా మాట వినుము. నా మానము
దీసిన నీ గర్వమడంచు వఱకు నా ముసుఁగు ధరింపను.
చూడుము నా పట్టుదల.

తిరుమల:—కుంటా! మదముచే నోటికి వచ్చినటులఁ బ్రేలిన
నీ నాలుకఁ గోయించెదను. భద్రము (స్వగతము) దీని
నింతటితో విడువరాదు. (ప్రకాశముగా) సేవకా! ఈ ను
హమ్మదీయ మహామారిని అంతఃపురమునకుఁ గొంపోయి

పనికై తెగ నియమించితిననియుఁ గావలసిన పనులఁ గొను చుండ మనియుఁ జెప్పుము. త్వరగా వెళ్లుము. పొమ్ము. నేను నతిత్వరితముగ వచ్చెదను.

సేవకుఁడు:—(గులాబ్ మహాల్‌ను వెంట నిడుకొని నిష్క్ర మించును.)

తిరుమల:—నేఁడుగదా సుదినము. మహమ్మదీయులను నా యిచ్చవచ్చినటులఁ బరిభవించితిని. వీరిలోఁ గొందఱైనను గోలకొండకేగి మహమ్మద్ కులీతో మొఱఁబెట్టుకొనక మానరు. అప్పుడైన వాఁడు కయ్యమునకు రాఁడా. అప్ప టికి రా వెనుదీసినచో నింకొక విధమున వానిని మట్టుఁ బెట్టెద. అంతఃపురమున నేమి జరుగుచున్నదో విచారించెద

(అని నిష్క్రమించును)

# తృతీయరంగము

ప్రవేశము:—వేంగళాంబ అంతఃపురమునందలి గదిలో నుండఁగా సేవకుఁడు గులాబ్ మహాల్‌ను దోడ్కొని మెల్ల గా వచ్చును.

సేవకుడు:—తల్లీ!

వేంగ:—ఎవరచ్చట. (అని తలుపుఁ దీసికొని వచ్చి వ్యసనము తోనున్న గులాబ్ మహల్‌ను జూచి) (స్వగతము) ఈమెనుఁ జూడఁ బరులచేఁ బరాభవింపఁ బడిన దానివలె గనఁబడు

చున్నయది. అయ్యో! పాపము. అయిన నీతీరున బల్కు
రించెద. (ప్రకాశముగా) సోదరీ!

ఉ॥ ఈవిధి దుఃఖవారిధిని
నీకతనాత్ముఁడు దోర్చఁ జేసెనో
నీవిపులాతురత్ దెలుప
నే బ్రతిమాలుచునుంటి నోసఖీ!
భావమునందు భీతిలక
పల్కుము నా పతితోడఁ జెప్పి ని
న్నీవిధిఁ జేసినట్టి నరు
నిప్పుడె దండనఁ జేసెదన్ సుమా.

గులాబ్:—తల్లీ! వలదు వలదు. ప్రమాద మొనరించితివి.
వేంక:— అమ్మాయీ! ఏమటులఁ బల్కెదవు నీవెవరు?
గులాబ్:—అమ్మా! నేనొక యభాగ్యను. పరులచేఁ బరాభా
వింపఁబడిన మహమ్మదీయ కాంతను.
వేంక:—పరులచేఁ బరాభవింపఁ బడితివా? అందులకే నాపతి
తోఁ జెప్పి వారిని శిక్షింతునంటిని.
గులాబ్:—రాణిసాహెబ్! వారిని నీవు శిక్షింపఁ జాలవని నా
మనవి.
వేంక:—అటులనకుము. నిన్ను తప్పక రక్షించెద. నా పలుకుల
విశ్వసింపుము.
గులాబ్:—జననీ! కంచెయే చేనిని మేయఁ దొడఁగినఁ గాచు
వారెవరు. రాష్ట్రాధిపతి యగు నీ భర్తయె నన్నిటుల గాసి

పెట్టియుండ నీవేమి చేయఁ గలవు. నన్నుఁ నీ సేవకురాలిగా నియమించి యిచటికిఁ బంపె.

వేంగ:—(ఆశ్చర్యముతో) ఏమీ! ఏమీ! నా పతి నిన్నిటుఁ గలవర పెట్టెనా?

గులాబ్:—ఇందేమి వింతయున్నది. ఇందు మోసమేమియు లేదు. మా యవివేకమే.

వేంగ:—లలితాంగీ! యదార్థము వచించితివి.

తే. గీ. కాంతలను బట్టి వంచించు-కాంక్షఁ గలుగు
మా వినాశమునకు మహా-మారి యగుచు
సంకురించెను మీవారి-యాత్మయందు
మీరు నేర్పిన చర్యలే-నీరజాక్షి.

గులాబ్:—అమ్మా! అందులకే నేఁడొంటరి నవివేకము మాదేయని యొప్పుకొంటిని. ఇంతటినుండి "అబలలు నగడుపడుచు నేమతముగాని యడఁగుంటుఁ గాక".

వేంగ:—గులాబ్ మహాల్! నా పతియే నిన్నిరీతిఁ జేసియుండెనే నేనీతిదండింపఁ గలను. అయిన నిన్ను రక్షింతునంటిని. తప్పక కాపాడెద. భయపడకుము.

సేవకు:—(లోపలఁ జూచి) తల్లీ! రాజుగారు వచ్చుచున్నారు.

వేంగ:—(గులాబ్ మహాల్‌ను జూచి) తరుణీ! నీ వొదిగి యుండుము.

ప్రవేశము:—తిరుమలరాయలు ప్రక్కన నొదిగియుండును.

తిరుమల:—కాంతమణి! లోపలికి రావచ్చునా.

వేంక:—చిత్తము. (చింతఁ జేయునట్లునటించును)

తిరుమల:—[ప్రవేశించి]తరుణీ! ఏమటులున్నావు నేఁ బంపిన సేవకురాలు నీ కనుకూలవతి యగునా? ఎచ్చట కేగినది. [ఇటునటుఁ జూచి గులాబ్ మహాల్ను గనుఁగొని] దుర్మతీ! నీ యజమానురాలిటులుండ యూరక చూచుచున్నావా? (అని కనులెఱ్ఱఁజేసి పైఁబడఁబోవును)

వేంక:—నాథా! నిలువుఁడు. అంతటి నార్దస్యము మీకుఁ దగదు. మీరా నారీమణి నేమిచేయఁ దలంచితిరి.

తిరు:—నీకు దాసిగాఁజేయు తలంపున (అర్ధోక్తి)

వేంక:—నాకేమియు వలదు. ఆమెను నేను దాసిగా నుంచుకొనునంతటి దానిని గాను.

తిరు—అటులైన జీవితమంతయుఁ గారాగారమున నుండునటులఁ జేసి [అర్ధోక్తి]

వేంక—ఆఁ. ఆఁ. ఏమీ!

సేవ—(ప్రవేశించి) మహారాజా! తాము పోర్చుగీస్ వర్తకుల నుండి యశ్వసమూహమును గొనియున్నారఁట తక్కిన తురగముల విక్రయించుటకు గోలుకొండ కేగెదరఁట' కనుక వెంటనే వారికొనఁగ వలసిన ధనమియ్యవలెనని కూర్చుండియున్నారు.

తిరు:—(కోపముతో) ఏమీ! అంత తొందరఁ జేయుచున్నారా. సమయమును గుర్తెఱుఁగరా. అటులైన నిచ్చట ధనమీయ్యరనియు, నా పేరుఁజెప్పి గోలకొండ మహామ్మద్

కులీతో వారికి రావలసిన ధనమిప్పించుకొనుమని నుడువుము. వినకున్న మెడఁబట్టి నెట్టివేయుము. ఇది నాయాజ్ఞ.

సేవ—చిత్తము (అని వెళ్లెను.)

తిరు—(వేంగళాంబను జూచి) ప్రాణసతీమణీ ఏమంటివి.

వేంగ—ఏమియులేదు. ఆమె నిచ్చవచ్చినచోటికిఁ బోనిండు. మారు పలుకకుడు. (తిరుమలరాయలు తలయూచుచుండ గులాబ్‌మహాల్‌ను జూచి) అమ్మా! నీవుకోరిన స్థలమునకు వెళ్లి సుఖంబుండుము. మాయందనుగ్రహ ముంచుము

గులాబ్—మహాభాగ్యము. ఇల్లీ!

ఉ॥ మానముఁదీసి, నీ పతియు
మానుష కార్యము లాచరించె, నో
మానవతీలలామసరో! యు
భాగ్యముఁగాంతువు నేను గాఁగ, నా
మానసమందుసిగ్గ మరువ
మాటలు వేయుచు జెప్పనేల నీ
మానముగాచి వీని యభి
మానము దీసెదఁ జూడు మిద్ధరన్.

(అని నిష్క్రమించును.)

తిరు—సతీమణీ! వింటివిగదా పలికిన పలుకులు.

వేంగ—అవును. దాని కడుపులో మండినది. (అని నిష్క్రమించును.)

తిరు—ఔరా! కాలమహిమ. ఆకాంతపైనుండెడి నాపట్టునలను నాభార్య పటాపంచలు గావించెను గదా.

తే॥ గీ॥ సకలమును సృష్టిఁ జేయునా-స్రష్ట యైనఁ
జతువులన్నిఁటి నేర్చిన-శాస్త్రియైన
పాలనముఁ జేయుచుండు భూ-పాలుఁడైన
వారి సతులకు నిలను లోఁ-బడఁగవలయు.

# చతుర్థరంగము.

ప్రవేశము:—గోలకొండ సుల్తాన్ మహమ్మద్ కులీ కుతుబ్ శాహా తన ప్రధాన మంత్రితోఁ గూడఁ గూర్చుంకి యుండును.

సుహ:—నజీర్! బిజపూరు వారికి వివాహ విషయమై పత్రికఁ బంపుమని చెప్పితినిగదా ఏమి చేసితివి.

ప్ర. మం:—మీ హుకుంనుయినచోఁ చేయకుండుటయుఁ గలదా? ఆనాఁడే పంపితిని. ప్రత్యుత్తరము కూడ వచ్చి యున్నది.

సుహ:—అటులనా? వారంగీకరించిరా?

ప్ర. మం:—అంగీకరించి యున్నారు. ఏదినమునఁ బరిణయము జరుప నెంచితిరది వారికిఁ దెలిపినచో బయలు దేరి వత్తుమని సెలవిచ్చి యున్నారు.

మహ:—అటులైనఁ బదిదినములు వ్యవధి నొసఁగి పదునొకండవ దినమున నిక్కడఁ జేరఁ రావలయునని వ్రాసి పంపుము.

ప్ర. మం.—జోహుకుం.

మహ:—మంత్రిసత్తమా! ఇఁకఁ బెనుగొండవారేమి చేయఁ గలరు? వారి మీఁదికిఁ గయ్యమునకుఁ బూనవలయును. కన్నతాకుడు వుడకయగు తిరుమలరాయలను లోఁబఱచుకొని గర్వమడంపకున్న మన గోలకొండ రాజ్యమునకు ముప్పు తప్పక రాఁగలదు

ప్ర. మం:—కదనమునకుఁ గారణముండవలదా?

మహ—కారణమును గల్పింతము.

సేవ:—(ప్రవేశించి) సర్కార్! ఫకీరు సాహేబులు మీ దర్శనార్థము వచ్చి కాచికొని యున్నారు.

మహ:—లోపలకు రమ్మనుము. (మంత్రిని జూచి) మంత్రివరా! వారెవరో తెలుసుకో. ఎందులకు వచ్చిరో గదా.

ప్ర. మం:—ఏదో భయోత్పాతము వచ్చియుండును.

ప్రవేశము:—నూర్ ఖాన్ అల్లాసాబ్ ఏడ్చుచు వత్తురు.

నూర్:—అరేఅల్లా' చచ్చీనాం సర్కార్! ఏమీ చెప్పాలె.

మహ:—ఫకీర్ జీ! ఏల దుఃఖించెదరు. సంగతి విశదీకరింపుడు

అల్లా:—సర్కార్! ఏమీ చెప్పా. (భయమును గనపరిచి) అబ్బా' హిందువులు మమ్మల్ నే కొట్టి కొట్టి యిడిసినార్ పెనుగొండాలో. ఈవు వగిలీపోయింది.

ప్ర. మం:—ఏమీ! పెనుగొండవారు మిమ్ముల బాధించిరా?

నూర్:—(భయముతో వడఁకుచు) అబ్బ-అబ్బ-ఏమిచెప్తా, మమ్మల్ నీ రాజాసట్కాని కంచీతో కొట్టీ-కొట్టీ యిడ్చీ పో మీనవాబ్కీ చెప్కీపో అన్నాడు. సర్కార్!

ఇంకొక్క సంగ్తి చెప్తా యినండి. మనదీ వాన్కి వ టోర్కని కొట్టూకే కట్టి పొడిచి నెత్తుర్కతీసి కుక్కలకీ పోసీనాక్. బాబయ్యా వుకుమే యింతా జరిగిందీ.

మహా:—సరి. చాలును. మీరు వెళ్లి మీ దేహము స్వస్థతఁ జెందువఱకు మా ముసాఫరు ఖానాలో నుండుఁడు. మీకుఁ గావలసిన సహాయములఁ జేయించెదము. (వారు నిష్క్రమింతురు.) సేవకా! (అని పిలుచును)

సేవ.—[వచ్చి నేలకు వంగి సలాము చేయును]

మహా:—నీవేగి సేనాని మీరు జుమ్ములాను రమ్మనుము. వెళ్లుము. (సేవకుఁడు నిష్క్రమించును.) మంత్రిసత్తమా! ఆదురాత్ముని చర్యల వింటివిగదా ఇఁక నూరకుండుటెట్లు సేనాని వచ్చిన తోడనే యుద్ధమునకు సైన్యమును సిద్ధము చేయుమని చెప్పవలయును. తిరుమలరాయలను మననియ్య రాదు. మహమ్మద్ కులీ బలపరాక్రమముల నాహించదు ప్రజల తెలియఁ జాలకున్నాఁడు. మన మూరకుండు కొలఁది కయ్యమునకుఁ గాలు దువ్వుచున్నాడు. కానిమ్ము [అని తలయూచును.]

సేవ—(వచ్చి సలాముఁ జేయుచు) సర్కార్! ఎవరో దొరలు. పోర్చుగీసు వర్తకులఁట. పెనుగొండ తిరుమలరాయలు అశ్వములనుగొని వారికొసఁగవలసిన ధనమును మీతో నిప్పించుకొనుమని పంపగా ధనమునకై వచ్చి తొందరఁ జేయుచున్నారు.

మహా—(కోపముతో లేచి తలయూచుచు మరలఁగూర్చుండి)

మంత్రివరా! ఏమా చండాలుని దౌర్జన్యము. వీనిని జంపి చెంపాడువా రున్నారను సంగతిని మఱచియున్నాఁడు కాఁబోలు. దురాత్మునకుఁ గాలమాసన్నమైనది. (సేవకునిఁ జూచి) ఏమిరా వారికి ధనముకావలయునా. (కోపముతోఁ దలయూఁచి) వారిని వన్నుచుఁ గొంపోయి దోసిళ్ళనిండుగ చింతనిప్పలఁబోసి తిరుమలరాయుని దగ్గఱికిఁ బంపుము. ముందీ కార్యమును జేయుఁడు. (లోపలకేగి) హా! తురుష్కమల్లానులారా! మహమ్మదీయ మానినుల మానము లపహరింప దీరిచట దాఁగిరిగదా. (ఇరువురు వినుట నభినయించి) వజీర్! ఏమాదీనాలాపములు. (మరల వినుట నభినయించుచు)

ప్రవేశము:—గులాబ్ మహల్ దుఃఖముతో మెల్లఁగా లోపలనుండి పద్యముఁ జెప్పుచు వచ్చును.

గులాబ్:—మ॥ అకటా! నావిధి నేమనందు భువియం
దన్యాయ మిట్లుండునే
సకలంబుల్ గను గోలకొండకుల సం
జాతుల్ నవాబుల్ సెసల్
ఒకరైనన్ నను గావరాకుగన వా
రున్నారటే యుండుచో
నకటా! యావిధి నున్న నన్ను శరణం
బన్నన్ దయన్ బ్రోవరే.

మహమ్మదీయ మతోద్ధారకులారా! శరణు. శరణు. రక్షింపుడు.

మహా—అమ్మాయీ! భీతిల్లకుము. నీవెవరు. ఏ దేశము. ఏమతస్థురాలవు.

గులా—[స్వగతము] ఇప్పుడు వీరికిఁ గ్రోధమును బెంచవలయు. [ప్రకాశముగ] సుల్తాన్ మహాప్రభూ! నేనీ నిర్భాగ్యపు దేశమున జన్మించి పరమతస్థులచేఁ బరిభవింపఁ బడిన మహమ్మదీయ యువతిని.

మహా—ఏమిరా! ఇది నిర్భాగ్యపు దేశమా. నీవు మా దేశపుఁ బవిత్ర మహమ్మదీయమానినీమణివా? మతగౌరవమును దెలుపు నీమేలిముసుఁగెక్కడ. దానిని ధరింపక పైనఁగప్పికొని యుంటివేల ?

గులా—అవును. గోలకొండ రాజ్యము తన యవక్ర పరాక్రమమును గోలుపోకుండిన పెనుగొండ తిరుమలరాయలు నాముసుఁగును స్వహస్తముతోఁ దీసి నన్నిట్లు లవమానపఱచి యుండునా?.

మహా—(తలయూచుచు) ఆహా! ఆచండాలుని చర్యలకు మేర లేకున్నదియా? అమ్మా! తెలిసెను. నీవిఁకఁ జెప్పఁబని లేదు. నేనన్నియు గ్రహించితిని. వానికిఁ దగినటులఁ జేయఁబూనియున్నాము. భయపడకుము. (అన్యోక్తి.]

ప్రవేశము-మీరుజుమ్లా.

మీరు;—[వంగిసలాము జేసి] సర్కార్! నన్ను బిలిపించిన కారణమేమి? [అని తనచూడ్కుల గులాబ్ మహాల్ వంకఁ ద్రిప్పి మెచ్చి తలయూఁచుచుండ ఆమెయు అటులనే జేయును.]

మహా:—[గులాబ్ మహాల్‌నుజూచి] అమ్మాయీ! నీవింక స్వే
చ్ఛగా వెళ్ళి నిర్భయముగ నుండుము. [గులాబ్ మహాల్ స
లామొనరించి వీరుజమ్ములాను చూచుచు నిష్క్రమిం
చును] సేనానీ! నీయసమాన పరాక్రమమును జూపఁదగి
న యదను తటస్థించినది. పెనుగొండ మీఁదికి దాడివెడల
వలసియున్నది. సైన్యమును సిద్ధముఁజేయుము. వివరముల
ను తర్వాతఁ జెప్పెదను.

వీరు:—మహాభాగ్యము.

[అందఱు నిష్క్రమింతురు]

ఇది ద్వితీయాంకము.

# గండికోట పతనము

## తృతీయాంకము:

### ప్రథమరంగము.

---

ప్రవేశము:—గోలకొండలో నొక యుద్యానవనమందు గులాబ్ సుహాల్ దుఃఖముతోఁ గూర్చుండియుండును.

గులాబ్.— చ॥ ఉరుసుఖముఁ బోవ నీకుఁ దగ
దూరక యుండుమటన్నఁ దల్లిపై
విరసముఁ జూపి పోవకులు
వేఁడిన వారిని ద్రోసిపుచ్చి, నే
డఱలితి స్నేహితుల్ జనఁగ
దాఁకి యుపాయ శాంతి యింక నా
పురమును జేర నవ్వదము
పోవఁగఁ జెల్లదు బుద్ధియుండినన్.

(చింతించును) అకటా! ఎంతటి విపదబ్ధిని మునింగితిని. నన్నీ దుఃఖవారధినుండి దరిఁజేర్పువారు లేరుగదా. ఆపాపి పెనుగొండ యురుసు నాకు జ్ఞాపకము వచ్చినపుడెల్లను నా దేహము మండుచున్నదే. ఆపాపి తిరుమలరాయల నామశబ్దము నాకర్ణములఁ బడిన నాకడుపునఁ జిచ్చుఁ బెట్టినటుల మండునే. అకటా! నామేలిమునుఁగుఁ దీసినది. బయకాఱ! యని సంబోధించినది మఱవఁగలనా? ఆపలుకుల ననుఁగొనినపుడెల్ల

వానిలువెల్ల నొక్కసారి వాఁడిగల సూదులతోఁ గ్రుచ్చినట్టు లుండునుగదా. ఆదురాత్ముని గర్వమడంపఁగల ధీరశూరుని యీగోలకొండ రాజ్యమున లేనే లేఁడా? తిరుమలరాయుని దిద్దిమ్మని యాడింపఁగల ధీరుఁడు ధారణిలో నెక్కడనైననుం డి, నాదుఃఖములో నర్ధముఁ బంచుకొని నాకోర్కెను నెఱవే ర్చినచో నాశూరాగ్రేసరునకు నేనర్ధాంగినై యుండెదనుగాక. లేకుండిన బ్రహ్మచర్య వ్రతముం బూని నాజీవితమంతయుఁ బుణ్యస్థలమగు మక్కాలో గడిపెదఁగాని; మూతిన చేసెడు హీనములఁ జెందుకొని కార్యములవట్ల వంటయింటఁ దూఱు పురుషాధముల ముఖమైన జూతునా. (యోజించి) అహా! జ్ఞా పకమువచ్చెను. నిన్నటిదినమున దర్బారులో సుల్తాను నెదుట నేనుండినపుడొక దీర్ఘకాయుఁడు నడుమున దీర్ఘకరవాలము వ్రేలాడుచుండ వచ్చి నవాబుకు సలామొనరించెను. సుల్తా నుగారతని సేనానీ! యని పిలిచెను. ఆపురుషవరేణ్యుఁడు నా వంకఁ బలుమాఱుఁజూచి మెచ్చి తలయూఁచె. నేనును జూ చుచుండ రాజగారంతలో నాయిష్టమువచ్చిన చోటికి నిర్భయ ముగఁ బొమ్మనిపంపె. ఆసుందరుని ఆవీరవరుని నాకన్నులారఁ జూడనైనఁజూచు భాగ్యము లేకపోయెనే. ఆమహాభాగుని న మ్మి చేరినచో నాకోర్కె తప్పక నెఱవేఱఁగలదు.

ఉ॥ సుందరమైనవాఁడు మహిఁ
జూడఁగ నీడును లేనివాఁడు, నా
వందముఁ గూర్చు పద్మనయ

నంబుల నొప్పెడువాఁడు మానసా
నందముఁ జేయు దీనముల
నాణ్యముఁ గల్గిన సీటుకాఁటు నర్థ
బొందుగ మెచ్చి శీర్షమును
ముమ్మాఱు నూపిన వాఁ డెటుగనో.

ఆమహాభాగుఁ డటకేగి యుండును. (యోచించి) అత
ని విడిదికేగి యుండఁగలఁడు. ఆమందిరమును విచారించుకొని
పోదునా? ఆఁడుదానను. ఎక్కడికనిపోయి విచారింపఁగలను.
ఎవ రైనఁ గనిన ననుమానింపరా! [యోచించి] ఊఁ అనుమా
నించి నన్నేమి చేయఁగలరు. అవమానమునకదా వెఱవవలసిన
ది. ఇప్పుడైన నవమానమునకంటె మిన్నయగు పరాభవము
కలదా? ఆమోహనాకారునిఁ జూడక నిలువఁజాల. ఏమైనఁ
గాని వెళ్ళెదనకేదఁ గాక. (అని పోఁబోయి మరల యోచించి)
ఏమిది నాకుఁ బిచ్చిపట్టునట్టులున్నది. నా బుద్ధి బుగ్గయైపోవుచు
న్నది. ఒకవేళ నేనేగి యాపురుషుని వేఁడిన సమ్మతించునో
నిరాకరించునో, నిరాకరించిన నేబ్రదికి ప్రయోజనము లేదు.
చీ శాంగరవతరాదు స్త్రీ తనమన్నమును పురుషులకుఁ దెలు
పరాదు. ఇంకను నిదానించిచూచెద. (ఉస్సురనుచుఁ గూర్చుం
డి యుండును.)

ప్రవేశము—విరూపజమ్మన్నలా.

విరూ:—ఓరా! నిన్నటిదినము దర్బారులో మెఱుపుఁదీఁగవ
లెఁ బ్రకాశించి తటాలున మాయమైపోయిన నామో

హిని యెందేగనోకదా. నేను దర్బారులోనుండి నవా బుగారి సెలవుపొంది వచ్చినదే నాసేవకుని నాకామినీమణి జాడను గనిపెట్టుటకు నియమించితిని. వాఁడేతెంచి ఆనా తిరికోమణి యీతోఁటలోని కేగినదని నుడివెను. పోయి వెదకుదునా? పరస్త్రీ యొంటిమై యున్నపుడేగిన నెవరైనఁ జూచినచో లేనిపోని కథలఁ గల్పింతురు. అటులఁ బోఁజె ల్లదు. పోకున్న నాసీలవేరీనిఁ గాంచుటెట్లు? అబ్బా! దా నినిఁజూడక నిలువఁగలనా?

ఉ॥ మోహముఁ గూర్చు నారమణి
ముద్దుముఖంబిపు డక్కటా నసుగా
మోహపు వారధిగా జొనిపి
పుచ్చెను, నిద్దురరాదు వచ్చినగా
మోహినిరూపు నాపడక
ముందరనుండినలాగు దోఁచు నే
మోహము నాపఁజాల నిఁక
బొందక దానినిఁ జూడకే కటా!.

ఎవరేమనుకొన్ననేమి. ఇట్టి తరుణమునఁ బరులను పా టింపరాదు. చేయఁబూనిన కార్యమును జేసియే తీరవలయు ను. వెళ్ళిచూచెద. (అని ముందునకుఁబోయి దూరమున గు లాబ్ మహల్‌ను చూచి తలయూఁచి) సెబాస్.

సీ॥ పూర్ణేందు బింబముఁ • బుగ్గిగావింపంగ
శక్తిఁ గల్గినదియౌ • సకియ మోము

బొంగరములఁదీవిఁ ♦ బోలి వానినిగెల్వఁ
 గలయట్టి బంతులా ♦ కలికి చనులు
కేసరిమధ్యముఁ ♦ మాసిపోఁగొట్టంగఁ
 జాలి కన్నె నయా ♦ చాన నడుము
అరఁటి కంబంబుల ♦ నరయఁగ మఱపించు
 సాటిలేనట్టి యా ♦ బోటి తొడలు
తే. గీ. సకల శృంగారములఁగూర్చి ♦ జగతి దాని
 సృష్టిఁ జేసెను కాఁబోలు ♦ స్రష్టతాను
 వర్ణనఁ జేయ నదములే ♦ భావ లేవు
 అట్టితరి నాకుఁ బొగడంగ ♦ నగునె? కాదు.

సరి. ఇఁకఁ దడయనేల. ఆరామానుజే సరసఁజేరి వలు కరించెద. (సమీపమున కేగి) నాకిశోరమణి! నిర్భాగ్యుఁడనయి నీయువ్యాసవదనమున నొంటరిగ దీనవదనయై కూర్చుం డుటకుఁ గతంబేమని యడుగవచ్చునా?.

గులాబ్:—ముఖముఁ ద్రిప్పుకొని అయ్యా! పరస్త్రీలొంటరి గ నున్నపుడు వారి సరసఁజేరి నిష్కారణముగఁ బలుకరిం పఁబూనుట మీయూరి యాచారము కాఁబోలు.

మీరా:—చంద్రాననా! నేను నీసరసఁజేరి పలుకరించినది నీ కు విరసముగఁ దోఁచినచోఁ దిరిగి వెళ్లి మరల నీయాజ్ఞయై నప్పుడు వచ్చెదను లెమ్ము. పోదునా.

గులాబ్:—పోదునా యని నన్నడుగనేల. నీయిష్టమువచ్చిన చోటికిఁ బొమ్ము.

మీరు:—మీనాక్షీ! ఇంతకు మునుపిచటికి రాఁగూడదనటులఁ బల్కితివే. ఇపుడు నీయిష్టము వచ్చినచోటి కేగుమని యెదవు.

గులాబ్:—ఔను. స్త్రీలొంటరిగ నున్నపుడు వారివద్దకు రాఁగూడదంటిని. కాని కోఁటలోనికి రారాదని కాదు. నిన్నాటంకపఱచుటకు నేనీకోఁట యజమానురాలినిగా నునుమా.

మీరు:—అనంగతి నాకును తెలియును. పంకజాననా! నివెవరు? పేరుతోఁగూడ సెలవిచ్చిన బాగుగనుండును.

గులాబ్:—నేనెవరైనను నీకేమి నీమార్గమున నీవుపొమ్ము. పనిలేనివారితోఁ బలుమాటలేల! నీపనిఁజూచుకొనఁబొమ్ము. నీవెవరికొఱకు వచ్చితివో వారికడ కేగుము.

మీరు—మచ్చకంటీ! మానవవ్యక్తులు కనఁబడినచో మంచి చెడ్డల విచారించి శక్తియున్నచో వారినాదరించుట ప్రతివాని విధియైయున్నందున నిన్నుఁ బలుకరించితిని. నేను రావలసిన మార్గముననే వచ్చితిని పనియుంచిన వారితోడనే బలుమాటలాడుచుంటిని, నాపనిఁ జూచుకొఱకే వచ్చితిని. నీకొఱకై నీకడకే విచ్చేసితిని. ఇఁకనీయిష్టము, నీయాజ్ఞకై వేచియుండెద. (అనిచేతులుఁగట్టుకొనినిలుచును)

గులాబ్:—(తనలో) ఏమీతని పలుకులు. నిర్భయముగ జంకులేక మాటాడుచున్నాడు. ఇదే సమయము. క్రోధమును బుట్టించెద. (ప్రకాశముగా) నేనీ పౌరుషరహితముగు

గోలకొండ తుచ్ఛతురుష్కకుల సంజాతను. అందునను బరమతస్థులచే నవమానింపఁబడి దిక్కులేని పక్షివలె నీ తోఁటకుఁజేరి ఆత్మహత్యఁగావించుకొనఁ దలఁచితి. పేరు గులాబ్ మహల్ అని పెట్టియున్నారు, నాతో నీకేమి పని లేదు. పోవచ్చును.

మీరు—వనజాక్షి! నీపరుషవాక్యములువిన్న నాకొకప్రక్క క్రోధమును, మఱియొకప్రక్క జాలియు జనించుచున్నది. మారాజ్యము తన సహజపౌరుషమును గోల్పోయియుండ లేదు. నీవు జన్మించినది పవిత్రమగు మహమ్మదీయమతము. ఆత్మహత్యఁ జేసికొనవలసినంత నీకేమివచ్చినది. (స్వగతము) వివాహితయగునో కాదో అడుగుదునా. ఏమనునో (యోచించి) ఇటులడిగెద. (ప్రకాశముగా) కలికీ! నీప్రాణకాంతుఁ డెందున్నాఁడు.

గులాబ్—పురుషవర్యా! నేనవివాహితను. ఇఁక నన్ను మాటలాడింపకుము.

మీరు—లతాంగీ! నేనుగూడ వివాహరహితుఁడనే యైయున్నందున మాటలాడించినను నరిపోవును లెమ్ము. రక్షించువారు లేరంటివిగదా. నన్ను వి-వా-హ-ము అందునా.

గులాబ్:—అనవలసిన పనిలేదు. నేనంత బుద్ధిహీనురాలిని గాను. స్త్రీలు స్వతంత్రులుకారని నీకుఁ దెలియదా.

మీరు—రక్షించువారు లేక స్వతంత్రముగ నుండునపుడు వారిజాతులు స్వతంత్రులు కారాదా.

గులాబ్—అయ్యో! నన్నురక్షించు కర్తలు భువిలో లేనేలే
రా. ఈభూఖండము గొడ్డువోయినదా.

మీరు—ప్రాణనాథా! నన్నే నిన్ను రక్షించు కర్తనుగ భావిం
చి పరిణయమాడిన బాగుగనుండదా.

గులాబ్—(యోచించి) మీరాగ్రహి! ఊరక పరిణయమా
డుమన్ననెట్లు. పరకాంత నిన్నారక చేపట్టుటెల్లు తటస్థిం
చును. ఆయాసవదలుము. ఆయాసపడకుము. నాకష్టముం
యందర్థము బంచుకొని నాకోర్కెఁదీర్చు ప్రాణేశ్వరునికై
నేనర్థాంగినై యుండఁ దలఁచితిని. అది నీచేతనగునా.

మీరు—అతివా! నాచేతఁగాని పనియున్నదా. ఒకవేళ యుం
డినను నీదయానిధము నాపైఁజల్లిన నెంతటి సాహసకృ
త్యమైనను నిముసమున నవలీలగఁ జేయఁజాలనా. నీకష్ట
ములన్నియు నాపి కాఁగలవు. భయపడకుము. నీకోర్కె
యెంతదారుణమైనదైనను శిరసావహించి చేయుదును.

గులాబ్—ఇట్టిహారనేకులు గలరు. పురుషులు తమకవసరమై
నపుడు యోచింపక చేతఁగాని పనులన్నిఁటిని త్రుటిలోఁ
జేయుదుమని చిటుకవేతురు. పనిముగిసినఁ బలుకరించిన
ను పాపమని పరుగులిడుదురు. వట్టిమాటలతోఁ గార్యము
ను సాధింపలేవు. పొమ్ము.

మీరు—నారీ! అందఱివలె నన్ను భావింపకుము. నీకోర్కె
నాకెఱింగింపుము. వ్యర్థముగాఁ గాలముగడుపుటమేలా.
గతించిన కాలము మరల రాఁబోదు.

గులాబ్—అయ్యా! తిరుమలరాయునిపేరు వినియున్నావా?
మీరు—ఎవరు పెనుగొండ తిరుమలరాజేనా.
గులాబ్—అవును. ఆదురాత్ముఁడు తనహస్తముతో నామేలి
ము-సుఁ-గు (దుఃఖముతో) హా! నేనుచ్చరింపఁజాల.
మీరు—మానినీమణీ! తెలిసెను. తెలిసెను. దుఃఖింపకుము.
ఊఱడిల్లుము. అందులకేనా నిన్నటిదినము దర్బారులో
నుంటివి. (తనలో) ఔరా! సుల్తానీసంగతి నాతోఁజెప్పి
న వాఁడుకాదే.
గులాబ్—పురుషాగ్రణీ! నీవు నన్ను చేపట్టఁగోరితివేని వాని
ని నవమానపఱచి నన్ను సంతోషపెట్టవలయు. అంతవఱ
కు ఆఖలునిచేఁ దీయఁబడిన నాముసుఁగును ధరింపనని శప
థము పూనియున్నాను. ఏమందువు.
మీరు—నన్నెవరినిగా భావించితివి. ఉచ్చశ్రేణి మహమ్మదీ
యకుల సంజాతుఁడ. హిందూమతమును ధ్వంసముఁ జే
యఁ గంకణముఁ గట్టికొనిన మీరుజుమ్లా పరాక్రమము
నీకింకను దెలియదు. నన్ను నేఁబొగడుకొనుట పాడిగాదు.

సీ॥ సుల్తాను కడకేగి ♦ సూరవాక్కులఁ బల్కి
కలనికిఁ బురికొల్పి ♦ కదలువాఁడ
పెనుగొండ వారిని ♦ బిలుకుమార్చెద నని
గండికోటనుబట్టి ♦ చెండువాఁడ
మన ముసల్మానుల ♦ మానంబు దీసిన
వారిని నవమాన ♦ పఱచువాఁడ

గుడిగోపురంబుల • గూల్చెద నిలువున
బ్రాహ్మణులను బాపఁ • బఱిమవాఁడ
తే॥ గీ॥ పలుక నేటికిఁ బలుమాఱుఁ • బంకజాక్షి!
యదను దొరికిన వెంటనే • మనముఁ గూర్పఁ
దఱిమి తిరుమలరాయుని • తలను నఱికి
తెచ్చి నీపదములఁ జేర్తు • తెఱవ వినుము.

అలివేణీ! రహస్య నాభవనమున సుఖముగ నుందము. ఇఁక మీఁదట నీదుఃఖమును బోఁ ద్రోసి మఱువుము.

గులాబ్ — ధీరవరేణ్యా! వచ్చెదనుకాని నాకోర్కెఁ దీర్చువఱకు నేను వివాహమాడుదానను గాను. అంతవఱకు నన్నుంటనని మాటయిచ్చినచో వచ్చెద.

మీర్ — మంచిది. నీయిష్టము వచ్చినటుల మెలఁగెదను.

గులాబ్ — మంచిది.

(అని యిరువురు నిష్క్రమింతురు)

# ద్వితీయరంగము

ప్రవేశము — గండికోటలో సామంతప్రభువగు తిమ్మానాయుఁడు దివాన్ కుమారదాసుతో ఆలోచించుచుఁ గూర్చుండి యుండును.

తిమ్మా — దివాన్‌జీ!

ఆ॥ వె॥ చెప్పరాని పనులఁ • జేసె నటంచును
గోలకొండవారుఁ • గుపితులగుచు

తెగువఁ జేసి యుపుడు ♦ తిరుమలరాయని
భండనమునఁ గెలువ ♦ సత్తురంట.

దినదినంబునకు మన బలంబులు సన్నంబులగుచుండఁ దెలియఁ జాలక తిరుమలరాజులు తుఱుష్కుల నవమాన పఱచెనఁట. పెనుగొండ యురుసులో బాధింపఁబడిన వారందఱును గోలకొండకేగి పాదుషాతో మొఱఁబెట్టుకొనఁగా వారు కోపోద్దీపితులై రణమున కాయత్తపడుచున్నారని వేఁగులవారి వలన వినవచ్చెను. తిరుమలరాయలింకను బూర్వపు వైభవమును జరపఁజూచుచున్నాఁడు. విద్యానగరము మరలఁ బూర్వస్థితికిఁ దేఁదలయునని పలువిధములఁ బోరాడుచున్నాఁడు కాని ప్రయోజనమేమి. విజయనగర భాస్కరుఁడగు రామభూపాలుఁడు తాళికోట కదనరంగమునఁ గూలిననాఁడే మన వైభవము లడుగువఁ బడియున్న సంగతి వారికిఁ దెలియకున్నది. అన్నను జంపినను కోపమే గాని యన్యము గలుగదు. పాదుశాఁబట్టి బాధింపనలేను కోరికనప్పనేటులేదు. మనమెంత చెప్పినను వినఁడుగదా.

కుమార—దానికి మనమేమి చేయఁగలము. పరాక్రమశాలి యగు మనరాజు ననుసరించియే మనము బోవలయును గాని వేఱుమార్గమవలంబించినఁ బగతులకు మఱింత లాకయగును.

తిమ్మా—ఔను. ఆవిషయము నాకుఁగూడఁ దెలియును. తురకలకు వెఱచి నేనటులఁ బల్కినవాఁడనుగాను సుమా!

దినములు మంచివిశ్రాంతవుడు కొందరవడక సముద్రమున కుఁ గాచికొనియుండి, యదను దొరికినపుడు యవనుల మట్టుఁబెట్టవలెఁగాక, ఎదుటి బలమును దెలియకఁ గన్నుం మూసికొని వారిపైఁబడిన నేమగునోగదా.

కుమార—సత్యమే.

తే॥ గీ॥ కానిదినమును వచ్చెనా? ♦ ఘనుల కైన
కష్టములెవచ్చుఁ బైఁబడి ♦ కరుణ లేక
వెళ్ళి గుహాలందు దాఁగిన ♦ విడువవెపుడు
రాఁదలంచిన కష్టముల్ ♦ రాకపోవు.

కాని జయాపజయంబు లోకరి స్వాధీనములుగావు. ఎవరి పలుకులనో విని గోలకొండవారు యుద్ధమునకు వత్తురని భయ పడనేల? ఆపలుకులు కల్ల కాకుండినచోఁ దిరుమలరాయలు మనకుఁ దెలుపకుండునా?

ప్రవేశము:—సీతారాముఁడు.

సీతా—మహాప్రభూ! ఏమిచెప్పుదును. ఎవరో గోలకొండవాఁ రఁట. గొప్పసైన్యముతో దిగియున్నారు. ఇంకను సైన్య ము వచ్చుచున్నటులఁ దోఁచుచున్నయది.

తిమ్మా—కుమారదాస! ఇపుడేమందువు. అనుకొనినటులా యెనుగదా.

తే॥ గీ॥ తగిలినటువంటి కాలికేఁ ♦ దగులుచుండు
నొగిలియున్నట్టి కొంపయే ♦ నొగులునవిడి
సామెతయుఁ దప్పకుండఁగ ♦ జరుగునవిరి

అదియె మనకయ్యె నిప్పుడే ♦ మనఁగఁగలవు.

కుమార—అవును. చింతించుటవలనఁ బ్రయోజనమేమి. పగవారేతెంచి కోటను ముట్టడించినతటి మనము భయపడుచుఁ గూరుచుండిన ప్రమాదము రాఁగలదు. ముందుచేయవలసిన కార్యములం దలంపుము.

తిమ్మా—ఏమున్నది. నాకేమియుఁ దోఁచలేదు. ఊరక కాలహరణము గావింపరాదు. దినములు గడచుకొలఁది మనకాహారపదార్థములు చాలకపోవును. అప్పుడు మన క్షేమనముపోయి వారికిఁ బాదాక్రాంతులము కావలసివచ్చును లేదా మనము మనకొలఁది సైన్యముతోఁగూడ మలమల మాఁడిపోవలసివచ్చును. కనుక యుద్ధమునకేగి పాలకునికొఱకుఁ బట్టుదలతో యుద్ధముఁజేసి కోటనుముట్టడించిన వారిని కోటకే బలియిత్తము. లేదా రణరంగమునఁజెగి వీరస్వర్గమునైనఁ జూఱగొందము. ఊరక గండికోటను వారిస్వాధీనముఁ జేయుదుమనుమాట కలలోనివార్తయని నమ్ముము.

కుమా—సరి. మనధర్మ మయ్యదియే.

తే॥ గీ॥ పలుకవలసినఁ బలుకులఁ ♦ బలికితీవు
సమరమునుమాన మనకిప్డు ♦ సరియొఁగాదు
ప్రభువునకుఁ దెల్పకుండుట ♦ పాడిగాదు
కనుకఁ బెనుగొండ కనుపుము ♦ మనుజనిపుడె.

తిరుమలరాయులవారికిఁ దెలియకుండ మనము శత్రువులఁ

దాఁకుట వారికిఁ దెలిసిన ప్రమాదమువచ్చును. వారిప్పుడు యుద్ధముఁ జేయుట సరియని తోఁచినచో ననుకూలమే లేకున్న బాగుగనుండదు. కనుక వారికి జరిగినసంగతి వ్రాయుచు మనదగ్గఱ భటులు తక్కువనున్నారు గనుక సైన్యముతోఁ గూడ బయలుదేరి మనకు సహాయముగ రమ్మనవలయు.

తిమ్మా—అవును. నీయోజనయుఁ బాటింపవలసినదియే. గోలకొండవారు గండికోటను సాధించినచో తక్కిన దుర్గములు వన్నింటిని సవలీలగఁ బట్టుకొందురు. కనుక మనశక్తి సామర్థ్యములఁ జూపి గండికోటను గాపాడుకొనవలసియున్నది. కనుక తిరుమలరాయలవారికిఁ గాగితము వ్రాసిపంపుదము.

కుమార—(కాగితమును గలమును దీసికొని వ్రాయుట నభినయించి ముగించిన తర్వాత) లేఖను జదువనా నేనా.

తిమ్మా—చదువుము

కుమార—

గండికోట.

ది 15-6-1652.

స్వస్తిశ్రీ తిరుమలరాయలవారి సన్నిధికి గోలకొండ నుండి మహమ్మద్ కులీ కుతుబ్ శాహా తన ముఖ్యసేనానియగు మీరుజుమ్లాను గొప్ప సైన్యముతోఁ బంపియున్నాఁడు. సేనాని మన దుర్గమును ముట్టడించి యున్నాఁడు. కనుక తగిన సైన్యమును దీసికొని మాకు సహాయము రాకున్న గండికోట మనది కాఁజాలదు. చిత్తగింపవలెను.

తిమ్మానాయఁడు. గండికోట సామంతప్రభువు.

(ముగించి) ఇఁక సంతకముఁజేయుఁడు.

మ్యా—(చేతికిఁ దీసికొని సంతకము చేసినటుల నటించి) సరి పోగనున్నది. దీని నెవరితోఁ బంపుదము.

కుమా—దీనికిఁ దగినవాఁడు మన సుదర్శననాయుఁడు. అతఁడు మిక్కిలి సాహసవంతుఁడు. ఎవరిదగ్గఱ నెటుల మెలంగఁ వలయునో అటుల మెలంగఁగలఁడు. మీరేమందురు.

మ్యా—మంచిది. (సేవకునిజూచి) సీతారాముఁడా! సుద ర్శననాయుని రమ్మనుము.

సీతా—చిత్తము [అని వెళ్లును.]

మ్యా—కుమారదాస్! తురకసైన్యమును దాఁటుకొని మన సుదర్శననాయుఁడు పోఁగలఁడా.

కుమా—తప్పక పోఁగలఁడు. అనుమానింపకుఁడు.

ప్రవేశము—సుదర్శననాయుఁడు, సీతారాముఁడు.

సుద—మహాప్రభూ! నమస్కారము.

మ్యా—నాయుఁడా! నిన్ను రమ్మను దీసికొని పెనుగొండ కుఁబోయి మా రాజుగారి కొసంగవలయు. ఆయనకు మన స్థితిగతులఁ దెలియఁజెప్పుము. (కుమారదాసునుజూచి) ఆ కాగితమునిమ్ము.

కుమా—ఇదిగో (కాగితము నొసఁగుచు) నాయుఁడా! దీని నేరీతి గొంపోఁదలఁచితివి.

సుద—దానిని నేనెటులఁ జెప్పఁగలను. బయలుదేరినపు డెటు లఁ దోఁచునో.

కుమా—భద్రముసుమా. పగవారిచేతఁబడినఁ బ్రమాదము జరుగును.

సుద—మీకాభయమేల.

క॥ కమ్మరుగాని నేనిప్పుడు
సమ్మతముగఁ బోవువాఁడ ♦ జతురత మోజయ్యా
వమ్మొనరింపను కార్యము
నెమ్మనమున నమ్మి దీని ♦ నిజమారయుమా.

తిమా—సరి జాగ్రత్తగ నేగుము.

కుమా—నీవు తిరుమలకాములతోఁగూడి వచ్చునపుడు రహస్యమార్గమునఁ బిలచికొనిరమ్ము

సుద—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు.)

—⁂—

## తృతీయరంగము.

ప్రవేశము—గండికోట బహిర్భాగమున మీరుజుమ్లాతన గుడారమున గులాబ్ మహల్తో ముచ్చటలాడు చుండును.

మీరు—గులాబ్ మహల్! క్రొత్తదానివలె నాతో మాటాడవేల?

గులా—మాటలతోఁ బనియేమి. కార్యముల సాధించువారికిఁ బలుకులతోఁ బనియుండదు. మీరు మాటలాడుటఁజూడ కార్యమును సాధించునటులఁ గన్పట్టను.

మీరు—ఉః మానిని యెంత వేడినను
మాటలనాడ వదేలఁ దెల్పుమా?
కానవె మాపరితాపమును
గానవె మాదగు సైన్యరాసులఁ
బానకొ! మాటలాడుము వె
చాలును మేమిఁకఁ గోర మెద్దియుఁ
మానిని! పల్కనఁ మఱలు
మాపయి రాలపు లెమ్మదేటికిఁ.

నీ ప్రతిజ్ఞ నెరవేర్పు నట్టుకు నన్ను వివాహమాడనంటి
వి. దానికి సమ్మతించితిని. ఊరక మాటాడనైన మాటాడరా
వా. నీ కార్యమును సాధించుటకేగదా నేఁ బ్రయత్నించుచు
న్నాఁడను.

గులాబ్—ఔను. మీ ప్రయత్నములఁ బ్రశంసింప వలసి యు
న్నది. కార్య సాధనమున కిదియా మార్గము.

మీరు—సరోజనేత్రీ! ఏమటులఁ బల్కెదవు.

గులాబ్—అవును. ఉన్నమాట యంటిని. మీరు నా కోర్కె
నెరవేర్పు వారే యైనచో, నీ గండికోటను ముట్టడింప
నేల? దీనితో నేమగును.

మీరు—(నవ్వుచు) ఓహో! నీ వటులఁ దలఁచితివా. మోహ
నాంగీ! ఈ తిరుమలరాయులకుండు ముఖ్యమగు దుర్గముల
లో నొకటి. నాకు మొదటి నుండియు నీ దుర్గమును సా
ధించవలెనను కోరిక యుండినందునఁ దొలుత దీనిని ముట్ట
డించితిని.

గులాబ్—సరి. బహు బాగుగ నున్నది. నీ కవసరమగు కార్య
ములనే చేసికొను చుందుము. నన్నింగాలకా నీ యింటి
ముందు మనుటయు, నీ వెంట నిడుకొని యిక్కడికిఁ బిలుచు
కొని వచ్చుటయు, సరి నాకు సెలవిమ్ము. వేఱొక చోటి
కేగ వలసి యున్నది నా విధి యిటులుండ నేనేమి చేయఁ
గలను. (దుఃఖముతో) హా దీనరక్షకా! యీ దీనురాలి
నిటులఁ గావించుటకు నీకే యపరాధము గావించితిను.

చ॥ ఎవరికిఁ జెప్ప దాన నిపు
డెవ్వరుఁ గానఁగఁ జాలనైతి, యీ
యవనిని దిక్కులేని సతు
లారయ నెవ్వరైన నున్నవారలే

సూరు— యువిదా! యిటు శోకపు లనె
యూరక భీతిల నేల యింకనే
బవరము నాకు నీ పగతుఁ
బాపెద నిశ్చయ మూరడిల్లుమా.

మానినీమణీ! ఏమి నీకుఁ బిచ్చి పట్టినటు లున్నది.

గులాబ్—ఔను. నాకుఁ బిచ్చియె పట్టినది. ఇటులనే యుం
డిన నా యసువులు గూడ బోఁగలవు. ఇతరులపై నాధార
పడి యుండువారి గతి యింతయే. నన్ను నేనే దూషించు
కొన వలసి యున్నది. ఎవరినన్న నేమి ప్రయోజనము.

సూరు—సుదతీ! నీవు పిచ్చిదాన వగుటయే గాక నాకు వెఱ్ఱిఁ
బుట్టించు చున్నావు. నీ మాటలు నా కేమియు బోధ పడ

కున్నదియవి. నెమ్మదిగ మాటాడ రాదా.

గులాబ్—అయ్యా! ఆయాస పడకుము. నన్నుఁ బోనిమ్ము (పోఁ బోవును)

మీరు—(అడ్డుపడి) తరుణీ! వలదు వలదు. నీ వేగిర నేఁ మనఁ జాల. నీవిట్టులఁ గినియుటకు గతంబేమి. నా దోస మేమి యో తెలియఁ బలుకుము.

గులాబ్—నీ దోసము లెంచు పని నాది కాదు. నే నంతటి దానను గాను.

మీరు—(కన్నులు నులుము) అబ్బా యేల బాధించెదవు. కారణముఁ జెప్పక కష్టపెట్టుట సరి కాదు.

గులాబ్—(తల యూపుచు) అయ్యా! పరకాంతకు లేని పోని యాసలు గల్పించి, యీ భంగి మోసపుచ్చు వారితో నేమి పలుకులు.

మీరు—వారిజాక్షి! నే నేమి మోసముఁ జేసితిని.

గులాబ్—పురుషవర్యా! తిరుమలరాయునిఁ బరాభవించెదనని ఇట్టులూరక కూర్చుండుట సరియా.

మీరు—వానిని జయించుటకే గదా వచ్చితిమి.

గులాబ్—అటులైనఁ బెనుగొండను ముట్టడింపక గండికోటను ముట్టడించితి వేల? నీవు మనసారఁ గోరిన కోట యనియా?

మీరు—సఖీ! తెలిసెను. నీ వింతకు మునుపు గండికోట నా కిష్టమైన దుర్గమని యనినందు వలన నీ విటుల విపరీతార్థము జేసికొని యున్నావు. ఇందలి రహస్యమును తెలిపెదను.

వినుము. నేనీ కోటను ముట్టడించినచో గండికోట వారి
సంగతిఁ దిరుమలరాయలకుఁ దెలియఁ జేయుదురు. అప్పు
డతఁడు వీరికి సహాయముఁ జేయు తలంపున పెనుగొండను
విడిచి యిక్కడికి వచ్చును. తిరుమలరాయఁ డిక్కడికి వ
చ్చిన తఱి, మన సైన్యమును పెనుగొండ కనిపి దానిని సు
లువుగ స్వాధీనముఁ జేసికొనవచ్చును. అతఁడు రాక పో
యినచో గండికోటను మొదలు పెట్టుకొని పెనుగొండ
వఱకుండు వారి దుర్గములన్నింటిని యొక దాని వెనుక
నొకటి జయించి తుదకు నీ పగతుని ముట్టఁబెట్టఁ దలంచి
తిని. ఇదియే నా పరమ రహస్యము. దీనిని దెలిసియుఁ జా
క నీ పూరక నిష్ఠురోక్తులాడుట సరి కాదు.

గులాబ్—(మనసును పదిల పఱచుకొని) ఏమో. కార్యమగు
వఱకుఁ బురుషుల నమ్మరాదు.

మీరు—అనుమానింపకుము. నన్ను సందేహింపఁ బనిలేదు.

తే. గీ. భాను బింబము వేడిమిఁ ♦ బాయుఁ గాక
కొండలన్నియు భూమిలో ♦ గ్రుంగుఁ గాక
భూమి యాకస మేకమై ♦ పొదలుఁ గాక
మాట నొసంగితిఁ దప్ప నా ♦ మాట వినుము.

ప్రాణాధారమా! నాఁడొక మాటయుఁ నేఁడొక మా
టయుఁ బల్కువాఁడను కాను. త్రికరణశుద్ధిగ నమ్ముము.

గులాబ్—నీమాట నిలుపు కొనినచో నా మాటఁ గాపాడు
కొనఁ జాలనా.

ప్రవేశము:—ముగ్గురు భటులొక బైరాగిని వెంటఁ బెట్టుకొని వత్తురు. బైరాగి కాలికిఁ గట్టు కట్టుకొని యుండి కుంటినటుల నటించుచువచ్చును.

ము. భ—మహరాజ్! ఏడెవరో బైరాగియట. కోటలో నుండి వచ్చుచున్నాఁడు. మాకేమో యనుమానము తోఁచి మీకడకుఁ దోడ్కొని వచ్చితిమి.

విూరు—(బైరాగిని బాగుగఁ జూచి) అయ్యా! నీ వీగండి కోట నుండి యెక్కడికి వెళ్లుచున్నావు.

బైరాగి—ఎక్కడికని చెప్పఁ గలను. బయలు దేరితిని. భోజన సమయమున కేయూరు వచ్చిన నక్కడ నిలుతును. ఒక యూరను నియమ మేమున్నది.

ఉ॥ సత్రములందు భోజనము

చావడియో మఠమందొ నిద్రయుఁ

యాత్రలఁ జేయు మాకు మఱి

యాచక వృత్తిఁ జరించు వారికిన్

క్షేత్రములందునే భువిని

శీఘ్రము దాఁచఁగ నిండ్లు గల్గునే

చిత్రముగా దె మమ్మునిటు

జిక్కులఁ బెట్టిన మేలు గల్గునే.

విూరు—సాధుజీ! నీ మాట సత్యమే కావచ్చును. మిమ్ము నూ భటులు పట్టి తెచ్చినది మీకుఁ దప్పుగాఁ దోఁచ వచ్చును, కాని అది వారి ధర్మము. కోటను ముట్టడించి

యుండునపుడు లోపల నుండి యెవరు వచ్చినను వారినూ
రక పోనిచ్చుట మా పని గాదు. సాధ్యమైనంత వఱకు వా
రిని బరీక్షించి మా కనుమానము లేకుండినచో నూరకఁ
బోనిత్తుము. అనుమానాస్పదముగ నుండిన వారిని శిక్షించి
కారాగారమున నైతుము. మీయందు దుష్ట భావము లే
కున్న మీ కేటి భయము.

బైరాగి— నాయనా! నా కేలాటి భయమును లేదు. ఇది
పాడుకాలము. ఇప్పటి వారు సజ్జనులను దుర్జనులుగను,
దుర్జనులను సజ్జనులుగను జేయు చున్నారు. న్యాయమును
విచారించువా రరుదుగ నున్నారు.

మీరు— మీ పలుకులు సర్వజన సమ్మతములు. కాని నమ్మి
న వారిని జెఱచు విశ్వాస ఘాతకులు లేరనియా మీ
యభిప్రాయము

బైరాగి— లేరనలేను. అనేకు లున్నారు. (అని కాలినొప్పిని
నభినయించును.)

మీరు— ఏమి. కాలు నొప్పియా. కట్టుఁ గట్టితి రేల ?

బైరాగి— నాయనా వ్రణముచే బాధ పడుచున్నాను.

మీరు— అటులనా! కూర్చుండుడు. (బైరాగి కూర్చుండును)
మీ రేమియు భయపడకుఁడు. బైరాగిజీ! మీ కే విద్య
యందుఁ బరిచయము గలదు.

బైరాగి— (తనలో) ఏమి ప్రత్యుత్తర మీయవలెను. కానిమ్ము.
(అని తల యూచుచుఁ బ్రకాశముగా) అయ్యా! యోగ

దృష్టిచే జరిగెడి సంగతులను బాగుగఁ జెప్పఁ గలను.

వీరు—అటులనా. సాధుజీ! మా యుద్దేశ్యములను గుఱించి యేమగుల జరుగునో చెప్పఁ గలరా?

బైరాగి—మీ యుద్దేశ్యమేమి.

వీరు—మీరే తెలిసి కొనుఁడు.

బైరాగి—(యోజించుచు పైకిఁ జూచి) అయ్యా! మీరు పెనుగొండ తిరుమలరాయులను జయింపవలెనని వచ్చి యీ కోటను ముట్టడించి యున్నారు. ఈ సంగతి పెను గొండ వారి కింకను దెలియదు. (మరల పైకిఁ జూచి యోచించి) ఈ దినము గండికోటనుండి పెనుగొండకు ఈ వార్త ను దెలుపుటకై జాబును పంపునటులఁ దోఁచు చున్నది. జాగ్రతగ నుండుఁడు.

వీరు—(తనలో) ఏమి యిటులఁ బల్కుచున్నాఁడు. ఇది నిజ మగునా? యోగదృష్టి యుండినను ఇంతవివరముగఁ జెప్పు ట మానవులకు సాధ్యమా. కానిమ్ము (ప్రకాశముగా) ఈ యుద్ధమున జయ మెవరికిఁ గలుగును.

బైరాగి—(స్వగతమున) ఏమని చెప్పవలయు. (ఆలోచించి ప్రకాశముగా) అయ్యా! ఖండితముగఁ జెప్ప సాధ్యపడ లేదు. జయాప జయము లొకరి స్వాధీనములు కావు సుమా?

వీరు—సరి. మీరిఁకఁ బోవచ్చును.

బైరాగి—(లేచి పోవునపుడు మరచి ఒక యడుగు సరాసరిగఁ బెట్టి మరలఁ గుంటినటుల నటించును.)

మీరు—(భటులను జూచి) ఓరీ! నాకు సంశయముగ నున్నది. ఆ బైరాగిని పోనియ్యకుఁడు. అతని వస్త్రములను పరిశోధింపుఁడు.

బైరాగి—(కలవరపడినట్టుల నటించి) అయ్యా! సన్న్యాసుల నవమానించెదరు. (బైరాగి నిలచి యుండ భటులు వెదకి మీరుజుమ్లాను చూచి) మహారాజ్ ఏమియు లేదు.

మీరు—ఆ కాలి గుడ్డను విప్పి చూడుఁడు.

బైరాగి—అయ్యా! ఔషధమును వేసి కట్టు కట్టి యున్నాను. దానిని విప్పఁగూడదు.

మీరు—పరీక్షించి తీరవలయును

బైరాగి—(భటులు బలవంతముగ కట్టు విప్పుచుండ స్వగతము) ఇంక నా గుట్టు బయలుఁ బడెను. లేఖ పోయిన పోయెఁగాక ప్రాణములఁ దక్కించు కొనవలయును. ప్రాణములతోఁ బెనుగొండఁ జేరిన కమ్మలోని సంగతులను రాజుగారి కెఱింగింపఁ గలను. మీచేతఁ జిక్కిన నా ప్రాణము దక్కఁబోదు (అని యిటునటుఁ జూచి భటులను క్రిందఁ బడఁద్రోసి పరుగెత్తి పోవును.)

మీరు—(ఆతురతతో లేచి) ఛీ తప్పించుకొని పోయెను. పొండు పరుగెత్తి పట్టి తెండు. జాగ్రత్తగ నుండ బనిలేదా? పరుగెత్తుఁడు పరుగెత్తుఁడు. అనఁగాఁ గ్రిందఁ బడిన యిరువురు భటులు లేచి పరుగెత్తుదురు.)

మూ. భ—(క్రిందఁ బడిన కాగితమును గైకొని) సర్కార్! ఇదేమో కాగితమును చూడుఁడు. (అని యిచ్చును.)

మీరు—(కాగితమును విప్పి చూచి) ప్రేయసీ! హిందువుల మాయలఁ జూచితివా. ఇది తిరుమలరాయునికి వ్రాసిన కమ్మ. చదివెదను వినుము. (అని చదివి) మనము వచ్చిన సంగతి పెనుగొండ వారి కింకను దెలియలేదు. ఇపుడు పరుగెత్తిన బైరాగిని పట్టితెచ్చిన సరియే. లేకున్న వాఁడు పెనుగొండ కేగి యీ సంగతి చెప్పక మానఁడు. తిరుమల రాయుఁడు సైన్యముతో వీరికి సహాయము రాక తప్పఁడు. కనుక నిపుడు గోలకొండకు జాబు వ్రాసి మన సుల్తాను గారిని సైన్యముతోఁ బెనుగొండ కేగి దానిని స్వాధీనము జేసికొను నటులఁ జేయుదను.

పునః ప్రవేశము:—పరుగెత్తిన భటులు వత్తురు.

భటుడు—మహారాజ్! ఆ బద్మాష్ చిక్కక పరుగెత్తెను. వానికి రహస్యపు మార్గము లన్నియు బాగుగఁ దెలిసి నటు లున్నది.

మీరు—మంచిది మీరు పొండు (అనగా నిరువురు భటులు నిష్క్రమింతురు. గులాబ్ మహల్‌ను చూచి) కాంతామణీ! నే జెప్పినటులె యైనది. అయినను భయము లేదు. సుల్తానుగారికిఁ గమ్మ వ్రాసెదను.

గులాబ్—సుల్తానుగారిప్పుడు తన సోదరి వివాహ వైభవములో నుందురు గదా. వారేగుదురో లేదో.

మీరు—నీవు పొరబడి యున్నావు. వివాహమహోత్సవము నిన్నటితో ముగిసి యుండును. ఇపుడు విందులు జల్సాలు జరుగుచుండును. అట్టి సమయమున మన కమ్మ చేరినచో

బిజపూరు వారుఁ గూడ సహాయము రాఁగలరు. ఈ యోజన తోడనే సుల్తానుగారు తన చెల్లెలిని బిజపూరు నవాబుగారి కొసంగెను. ఇందలి రహస్య మెఱింగితివా?

గులాబ్—ఇపుడు బిజపూరు నవాబెవరు?

మీరు—నీకుఁ దెలియదా రెండవఅడిల్‌షా

గులాబ్—మంచిది. జాబు వ్రాసి పంపుదు.

మీరు—(బల్లపై నుండిన కాగితమును దీసికొని జాబు వ్రాసి భటునితో) ఓరీ! తక్షణము బయలుదేరి గోలకొండకేఁ సుల్తానుగారి కీ కమ్మ నొసంగుము. (బైరాగి జాబు తీసికొని) దీనినిఁ గూడ వారి కొసఁగుము. (అది యియ్యఁగా వాఁడు తీసికొని వెళ్లును.)

అందఱు నిష్క్రమింతురు.



# చతుర్థ రంగము.

ప్రదేశము:— గండికోట బహిర్భాగపుఁ బర్వత మార్గమున బైరాగి రూపముననుండు సుదర్శన నాయుఁడు.

తే॥ గీ॥ సకల సందేశములఁ గొని సాహసమున
వైరి వర్గంబు దాఁటెడి వాఁడు నేఁడు
చిక్కఁ గలిగెను తుచ్ఛుల చేతి యందు
చెడ్డ కాలంబు మూడెస జేరి యుంట.

లేకున్న దండధరుంబోలు యోధ వర్గంబు లెన్నియో తెంపుఁ జేసి మమ్మును, మా దుర్గములను నెన్ని సారులు ముట్టడించి యుండ లేదు. అట్టి మహా విపత్సమయముల యందవలీలగ నట్టి రహస్య లేఖల నైన నాసమయ మీసమయ మనక కొనిపోవు యుక్తిశాలి, సాహసవంతుఁడు నేఁడిటుల నీ స్వల్ప సైన్యమును దాఁట లేక చిక్కెనా? (యోచించి) ఏమి నా యవివేకము. లేఖను దాఁచుట కెన్నియో గూఢమార్గము లుండఁ గాలికిఁ గట్టికొంటిని. కట్టికొంటినిబో; పంగుని బోలె నటించు వానిని పోల్చఁబడి ఆ నౌకరు నుబుసును జక్కఁగఁ బట్టు కుందులకు? అది నా యవివేకమే గదా. "ప్రమాదో ధీమతామపి" అనున్నట్లు కాకున్నచో నన్ను మించిన వారికి సహిత నిట్టి విపరీతములు తప్పించుమనే యుండును. (మరల యోచించి) అయిన నేనిటుల కిమ్మనుకొనిపోక రిక్తహస్తములతోఁ బోయి తిరుమలరాయుల వారికిఁ సంగతిఁ దెలిపినను వారు నమ్మనత్తురు. కాని యిక్కడికి వచ్చిన పిదప జాబు వ్రాసి పంపితిమని చీరనిన నా మోసమును, నశక్తతయు బయటఁ బడును. ఇన్ని దినములనుండి గడించిన పేరు ప్రతిష్ఠల నేఁడు గోలుపోవలసి వచ్చెను. అదియుఁగాక యింత కాలమిట్టులే మోస మాచరించు చుండెఁ గాంబోలు నను నూహాయు వారికిఁ బొడగట్టును. ఛీ! ఇట్టి యపయశస్సును గడించి బ్రతుకు టెందులకు. నేను గోలుపోయిన కమ్మను మరల సంపాదించిన పెనుగొండ కేగవలయును గాని శూన్య హస్తములతోఁ బోవు టెందులకు? కనుక నిప్పుడే.

తే. గీ. వెళ్ళవలె మీరు జన్మ్మలా విడిచి కడకు
నడుగవలె కన్న నిమ్మని యడిగినంత
నియ్యకొండిరిఁ బడద్రోసి క్రొవ్వుఁ దీయు
వలెను; లేకున్న నసువుల బాయ వలెను.

మరియు పత్రాంకము జూపుట కిదిగదా యదను. (అని పోఁబోయి మరల యోచించి) ఏమిది. "పెద్దతనము పో యి బుద్ధి పెడతల బట్టెన" అనునట్లు నాకుఁ బిచ్చి తలకెక్కు చున్నయది. నే నేగి కన్న నిమ్మని యడిగినచో వారుఁ గొ మ్మని నాకిత్తురా? కన్న గొనుట యటుండనిచ్చి నన్ను కారా గృహమునఁ బడద్రోయుదురు. మీఁదు మిక్కిలి మాటాడిన ప్రాణములఁ దప్పక తీయుదురు. ఆ లేఖ కొఱకై నా ప్రాణ ములఁ గోల్పోయి మా రాజునకు ముప్పుఁ దెచ్చుట కంటె నా ప్రాణముల దక్కించుకొని నాకుఁ దెలిసిన లేఖలోని సంగ తులను పాలకుని కెఱింగించి, వానిని యాపదలనుండి తప్పించు ట యుత్తమోత్తమము. కనుక నాకుఁ బెనుగొండ కేగుటయే సమంజసముగ నున్నయది. (యోచించి) అయిన నా కొకటి స్ఫురించు చున్నయది. నా లేఖలోని సంగతులను వారు గోల కొండకుఁ దెలియఁ జేయుక తప్పరు. అందులకై వారు వార్తా వహుని బంపియే తీరుదురు. నే నింకను గొంతసేపు కాచుకొని యుండి, వారిచేఁ బంపఁబడిన వాఁడేతెంచినచో హతమొన రించి లేఖను గొంపోయెద. ఇది మంచియుక్తి. (అని యిటు నటుఁ జూచి) దూరమున నెవఁడో మహమ్మదీయుఁడు వచ్చు నటు లున్నది. వాఁడు నన్ను గాంచిన వేఱొక మార్గమునఁ

బోయినం బోవచ్చును. ఇచటనే దాగి యుండెద. వాడు మీరు జుమ్మలా వలన బంపబడిన వాడో తిరిగినవాడో కనుగొన వలెను. ఊరక పైబడరాదు. గోలకొండ కేగెడి వాడే యైన నో "కొట్టి వితికిగి నేతం బటిన ట్లే" (తల యూచుచు) చూ చెద. (అని దాగును)

ప్రవేశము:—తురుష్క-భటుడు.

తు. భ:—ఇచటను మునుపొక వ్యక్తి నిలువంబడి యుండినటు ల గనంబడెను. గోలకొండ కేగుటకు సమీప మార్గమేది యో యడిగి తెలిసికొందమని వేగముగ వచ్చినను ప్ర యోజనము లేక పోయెను. ఇంత లోపలనె నెందేగి యు న్నను. నాకు తెలిసిన మార్గము చాల చుట్టు. సమీప మార్గమును తెలుపు వారు లేరైరి. [అని యిటునటుం జూచుచు నిలచును]

పునః ప్రవేశము:—బైరాగి వేసమునను౦డు సుదర్శన నాయుడు.

సుదర్శ—ఎవరయ్యా! తాము. అలసి యిందుం గూర్చుండి యుంటిని. వచ్చుచున్నాను.

తు. భ:—[తనలో] వీడు యింతకుముందు మాచేం జిక్క తప్పించుకొనిన బైరాగివలెం గనంబడు చున్నాడు. మోస మయ్యెను. [తలయూచుచు] కానిమ్ము. [ప్రకాశముగా] అయ్యా! నే నొక బాటసారిని.

సుదర్శ—[తల యూచి] ఎక్కడికేగెదవు.

తు. భ—(తడబడి). మా గ్రామమునకు

సుదర్శ—[స్వగతమున] ఔరా! ఇంతకు మునుపు గోలకొండ కు సమీప మార్గము తెలుప వారెవరును లేరని పరిత పించి యిపుడీవలెఁ బలుకుచున్నాను. బహుశః నన్ను గుర్తించి యుండును. అయిన నీవలెఁ బ్రశ్నించెద (ప్రకాశ ముగా) ఏ గ్రామమునకు

తు. భ—ఇక్కడికి సమీపమున నున్న గ్రామమునకు

సుదర్శ—[సమీపించి] నిజమా. నేను గూడవచ్చెదను.

తు. భ—[కొంచెము వెనుకంజ వేయును.]

సుదర్శ—[తనలో] ఇఁక నాలస్య మొనరింపరాదు. [అని పైఁబడి కొంతసేపు వానితోఁ గలహించి, క్రిందఁ బడఁ గొట్టి పిడికిటితోఁ బొడవగా తురుష్కుఁడు మూర్ఛఁబోవును.] అపుడు వెదకి రెండు లేఖలను దీసికొని పరీక్షించి యందొక దానిని జూచి [ప్రకాశముగా] ఇది నాకుఁ గావలసిన యుత్తరము. [రెండవ దానిని జూచి] ఇది గోలకొండ సుల్తానుకు వ్రాసినదై యుండును. హిందూస్థాని భాష లో వ్రాసి యున్నారు. భాష మాకుఁ దెలియదు కాఁబట్టి దీనితోఁ బని లేదు. [అని పారవైచి] నా జాబును మాత్రము తీసికొని పోయెదను. ఔరా! భగవంతుఁడు నా గౌరవమును గాపాడెను. వీఁడు మూర్ఛనుండి లేచులోపల కొంత దూర మేగవలెను. వెళ్లెద. (అని నిష్క్రమించును.)

తు. భ—(మూర్ఛనుండి లేచి చుట్టును జూచి) ఔరా! మాకుఁ దగినట్టు చేసెను. నేను దప్పించుకొనుటకుఁ బ్రయత్నించు

చుండగనే నా పైఁ బడెను గదా. హిందువులను వారి యుక్తి, శక్తి, బుద్ధి, మఱియు చుఱుకు దనమునకు మెచ్చ వలసి యున్నది. నా రహస్యమును వాఁడు నిముసములో గ్రహించెను గదా. ఇపుడు వాని లేఖయే గాక మా కమ్మ సహితము బోయెను. అందలి రహస్యమును దెలిసికొని యుండును. ఇఁక మా ప్రయత్నము లన్నియు నిష్ఫలమగు ను గదా. ప్రయత్నములు నిష్ఫలమగుట యటుండనిచ్చి నా ప్రాణములకె ముప్పు వచ్చెను. మీరుజుమ్ములా వ్రాసి యొసంగిన లేఖను సుల్తాను గారికిఁ జేర్చక పోయినచో నా కిప్పుడె నూఱేండ్లు నిండినట్లే. సైనిక శాఖలోఁ బనిజే యుటయన్నఁ గత్తిమీఁది సామనకఁ దప్పదు. అయ్యో! నన్నూరక చంపుదురే. అబ్బా! (భయములో) నా భార్య గతి యేమగునో. ఇఁక నాకు దిక్కెవ్వరు? ఆ బైరాగిని వెదకి వానిని గ్రిందఁ బడఁగొట్టి జాబులను గొని పోయెద. అబ్బో! వాఁడు సామాన్యుఁడా. నాబోటి వానికి దొరకు నా. ఇఁక నాకుఁ జావు దప్పదు. (క్రిందఁ జూచి తొందరతో) అబ్బా! చిక్కెను చిక్కెను. (అని క్రింద బడియుండిన కాగితమును దీసికొని చూచి) మా జాబు దొరికెను. అరెఅల్లా! నా ప్రాణాలు దక్కెను. ఆ జాబు పోయిన పోయెఁ గాక. మా జాబు లభించెను. ఇఁక గోలకొండ కేగ వచ్చును. ఇచ్చటనె యాలస్యముగ నుండిన వాఁడు మరల వచ్చినఁ బ్రమాద మగును. తొందరగ వెళ్లెద.

(అని నిష్క్రమించును.)

# గండికోట పతనము.

## తృతీయాంకము.



### (ప్రథమరంగము.)

ప్రవేశము:—గోలకొండ యందలి యుపవనమునందు మహమ్మద్ కులీకుతుబ్‌శాహ సహోదరి వివాహానంతరమున బీజాపూరు రాజైన యిబ్రహీం అదిల్‌షాకు తోటవిందు జరుపుటకుఁ బ్రయత్నములఁ జేసి ఆసనముల సమర్చి యుండ, యిరువురు నవాబులు వారి మిత్రులతోఁ గూడ నాసీనులై యుందురు.

మ. కు—(హుక్కాను బీల్చుచు) ఐ ముసాహెబానే ఆలీతెబాక్, కల్‌తో కత్ ఖుదాయియె, హంషీరయె నేక్ అఖతర్ హామకా. ఐ దోస్తానే! బాపిజేర్ భూల్‌చూక్ కత్ ఖుదాయిమె అగర్ సర్ జద్ హువిహోతో, అజరాహెలుత్ఫో కరం ఫర్మాకర్ నవాజిష్ ఫర్మాయియేగా.

మిత్రులారా! నిన్నటితో నా సహోదరి వివాహము ముగిసెను. అందు మాలోపములేమైన నుండినచో క్షమింప వలయునని నా ప్రార్థన.

ఇబ్రహీం_ఐ ఖుష్ నెహన్,
ప్యారే ఆజీజ్, నిజ్ బతీ
బిరాదర్ ఖుష్ రహో, క
హ్ ఖుదాయీ మేతో కు
చ్ భూల్ చూక్ నహీం
హువా? బడీఖుషీసే షాది
తో హోచుకీ ఆప్ డీగర్
అక్ష లాస్ మనానేకేగరజ్
హమీ హమారె ఒ
తన్ కు నహీంగయే సరీకా
మాల్ తప్ రఖేహై. అజ
రాహె బందానవాజీ ఇస్
జల్సేకె బాద్ హమీ
రొఖ్సత్ దేకర్ మంనూ
న్ ఓ మష్కూర్ పర్మా
యియేగా.

బావగారూ! పరిణయము బహు సంతోషముగ జరిగినది. మీ లోపము లేమియు జరిగి యుండ లేదు. మీ సత్కారములను మరువఁ జాలము. మమ్ముల మీరు మా రాజ్యమునకుఁ బోకుండ, విందులని, పండుగలని యేదో యొక నెపమున నిలుపుచున్నారు. మా యందు దయయుంచి యీ తోఁటవిందు ముగిసిన పిమ్మట నైనను మా దేశమున కేగుటకు సెలవొసంగ వలయును.

ఒ. మితు_యే సచ్ బాత్ హై
ఇది నిక్కము.

రెం. మి_ఆజ్ రాత్ రొఖ్ సత్
లేకర్ బిజాపూర్ చలా
జానా చాయియే.
నేఁటి రాత్రి సెలవు గైకొని బిజాపూరునకుఁ దప్పక పోవలయును.

మ. కు_ఆప్ కీ ఖుషీహై, చలే
జాసక్తేహై మగర్ ఆజ్
కా జల్సా బడేజోర్ షోర్సే చల్నా చాహియే. ఐ సాహెబ్! క్యోం దేరీ
మంచిది. మీ కోరిక ప్రకారము జరుప వచ్చును. నా యభ్యంతర మేమియు నుండదు. నేఁడీ వనభోజనము బాగుగ జరుగవలసి యున్నది.

| | |
|---|---|
| కర్ రహాహై. మసాలా బెగుల్ గూనా జల్ద్ లాదో. ఔర్ ముంజలీసె నషాద్ మొహీయా కర్ దో. | సేవకా! ఎందులకు కాలయాపన మొనరించుచున్నావు. మంచి సారాయమును దానికిఁ గావలసిన సంబారములతోఁ గూడ సిద్ధము చేసికొనిరమ్ము. |
| సాకై—జో హుకుం. (అని సిద్ధముచేసి బల్లపై నిడియున్న సీసాలోని సారాయమును గ్లాసులలో నింపి వారి యెదుటనుండు బల్లపై నిడును.) | చిత్తము (అని వారి యెదుటనుండు బల్ల మీఁదఁ బెట్టి పెట్టును.) |
| మ. కు-(ఇబ్రహీం అలీల్ షా నుమాచి) ఏ దిల్ ఆరాం నిజ్ బతీ బిరాదర్! యే లీజియే ఔర్ పీజియే (అని యియ్యఁబోవును.) | ఇబ్రహీంజీ! దీనినిఁ గైకొని త్రాగుము. |
| ఇబ్ర—జీ! హా లేతాహూఁ మగర్ ఆప్ పహిలె నోష్ ఫర్మాయియే. | మంచిది. తీసికొందును. ప్రథమమున మీరు పుచ్చుకొనవలసి యున్నది. |
| మ. కు—నహీఁజీ! నహీ. ఆప్ పహిలె నోష్ ఫర్మాయియే. | కాదు కాదు. మొదట మీరే గైకొనవలెను. |
| ఇ—అచ్ఛా! బహుత్ ఖూబ్. | మంచిది. తీసికొందును. (అని గైకొని త్రాగును.) |
| మ. కు—(మరియొక గ్లాసునింపి) తుం భీలో (అని ఒకటవ | మీరు గూడ పుచ్చుకొనుఁడు (అని యియ్యఁబోవు |

| | |
|---|---|
| మిత్రుని కిట్లు బోవును.) | ను.) |
| ఒ. మిత్రు–సర్కార్ రేఆప్ ఆప్ సర్కార్ హై. ఆప్ పహిలె నోష్ పర్మాయియే, బాద్ జూహమ్‌కో యినాయెత్ కీజియే. | ప్రభువులు తాము ముందు తీసికొని పిమ్మట మాకొసంగిన బాగుగనుండును. |
| మ. కు–లోజనాబ్! హమ్ యిస్ వఖ్త్ నవాబ్ నహీఁ హై, తుమ్ దోస్త్ హమ్ హమ్‌జిన్స్ హై. హమారా కామ్ హై కి పైలే పవాల్ ఆప్‌కీ మెహమానీ దారీ బజాలాయె. | మిత్రసత్తమా! మొదట మీరు తీసికొనుఁడు. నేనిపుడు మీ మిత్రుఁడను గాని నవాబును గాను. మిమ్ము గౌరవించవలసిన భారము నా తలపై నున్నది. నేను మీ గృహమున కేతెంచినపుడు నన్ను గౌరవించ లేదా? నా విధిని నే నొనరించు చున్నాను. మీరు వేఱు విధముగఁ దలంపకుఁడు. |
| ఒ. మి–అచ్ఛా. ఆప్‌కా హుకుమ్ బజాలాతాహుఁ. | చిత్తము. మీ కోరిక ననుసరించి తీసికొందును. |
| మ. కు– (ఇంకొక గ్లాసునింపి) ఆప్ నోష్ పర్మాయియే. (అని యిచ్చును) | (ఇంకొక గ్లాసు నింపి) తాముగూడ గైకొనుఁడు. (రెం. మి. ఇచ్చును) |
| రెం. మి–జీ! హా. (అని తీసికొని త్రాగును.) | చిత్తము (అని పుచ్చుకొనును.) |
| మ. కు–మొదటిమిత్రుని (గ్లా | [తానుగూడ గ్లాసునిండు |

సు॥ దీసికొని నింపి తాను త్రాగును.) | గ సారాయమును త్రాగును ]

మొ. మి-(ఇబ్రహీం అదిల్‌షా పీల్చెడి హుక్కాను కొని తానుబీల్చి రెండవ మిత్రుని కియ్యగా అతఁడు తీసికొని బీల్చు చుండును. | [హుక్కాను గైకొని తాను బీల్చి రెండవ మిత్రుని కొసఁగును ]

మ. కు-(రెండవ స్నేహితుని నుండి హుక్కాను తీసికొని పీల్చుచు) ఐ సాఖై షరాబె అంగూర్ లావో. | [హుక్కాను బీల్చుచు] ఓసాఖై! మంచి ద్రాక్ష సారాయమును తెమ్ము.

సాఖై జోహుకుం సర్కార్! (అని తెచ్చి బల్లపై నిడును) | చిత్తము [అని తెచ్చి పెట్టును ]

మ. కు-(గ్లాసులనింపి అందఱి కొసఁగి తానును త్రాగి హుక్కాను బీల్చుచు) ఐ యారో! కుచ్ మజా మిల్‌రహాహై? కుచ్ లుత్ఫ్ భీ మిల్‌రహాహై? | (సారాను అందఱికొసఁగి తానును త్రాగి) మిత్రులారా! మా పదార్థములు మీకేమైన రుచించినవా లేదా?

అందఱు-జీ! హాఁ. హుజూర్ జీ! హాఁ. | బహుబాగుగ నున్నవి.

మ. కు—సాఖై! బతేషరాఫ్ హాజర్ కే జయే. | సాఖై! రెండవ రకము సారాను తెమ్ము.

సాఖై-జీ! హాఁ. జోహుకుం. (అని తెచ్చి పెట్టును.) | చిత్తము. (అని తెచ్చి పెట్టును.)

| | |
|---|---|
| మ. కు - (అందఱి కొసఁగి తాను ద్రావి శావమరఁది పీల్చికి హుక్కాను గైకొని పీల్చుచు) ఏఖాదిం పలావె మున్ని దీద్ ఔర్ పలావ్ లాకర్ చుఁగదో. | [ అందఱి కొసఁగి తాను పుచ్చుకొని హుక్కాను బీల్చుచు ] ఏ నౌకర్! రెండు విధములగు పలావును తీసుకొనివచ్చి వడ్డించుము. |
| ఖాదిం జీ! హా హాజర్ కియా. (అని నాలుగు పళ్లెరములలో నిడియుండిన దానిని తెచ్చి వారిమొకుట నుండు బల్లపై నిడగా నలుగురు భుజింపఁ దొడఁగుదురు. | చిత్తము. తెచ్చితిని. [ అని తెచ్చి పెట్టును. ] |
| మ. కు - ఔర్ క్యాహై. | ఇంకేమున్నది. |
| ఖాదిం - సర్కార్! కబాబ్ ఔర్ రోటీహై. | సర్కార్! రొట్టెలును వేఁపుడు మాంసపు ముక్కలును నున్నవి. |
| మ. కు - అచ్ఛా. కబాబ్ రోటీ లాయియే. | మంచిది. వానిని దెమ్ము. |
| ఖాదిం - (తెచ్చిపెట్టి) సర్కార్! బిరియాని ఔర్ ముతంజన్ భీ హాజర్ హై. హుకుంహోతో తామీల్ కరూంగా | [ తెచ్చి] సర్కార్! తీపు గంబోఁత అన్నము మఱియుఁ జక్కెర పొంగలి సిద్ధముగ నున్నవి. ఆజ్ఞయైన దెత్తును. |
| మ. కు - బహుత్ ఖూబ్ లాయియే | సరి. తీసికొని రమ్ము. |
| ఖాదిం - [ తెచ్చివడ్డించును ] | [ తెచ్చి పెట్టును. ] |

మ. కు- ఔర్ క్యా హై ?

ఇంకను నేమున్నది ?

ఖాదిం-బై జేమురగ్ ఔర్ సమోసె భీ హాజర్ హై.

మాంసపు బిస్కతులును, వాడిన కోడి గ్రుడ్లను సిద్ధపఱచితిని

మ. కు-జల్ద్ లాయియే

త్వరితముగఁ దీసికొని రమ్ము

ఖాదిం- [ తెచ్చిపెట్టి నిలిచి యుండును,]

[పెట్టి నిలుచుండి యుండును ]

మ. కు- హమారె బావర్చీ ఖానేమే ఔర్ క్యాక్యా అల్వానె నేమత్ హై ?

ఇంకను నేమేమి పదార్థములు సిద్ధ పెట్టితివి ?

ఖాదిం—హుజూర్ కె బావర్చీ ఖానేమె కిస్ బాత్కీ కమీ హై. జోచాహతే హై హాజర్ హై హమారా అల్వానె నేమత్ తోఁచె హమారా షర్ నే భీ హై.

ఏమియుఁ గొఱఁతఁ బడి యుండలేదు దేవరవారు కోరిన పదార్థములన్నియు సిద్ధముగ నున్నవి, కారపు వస్తువులతోఁ గూడ మధుర పదార్థములు సహితము గలవు.

మ. కు-కహాఁతో ఔర్ క్యా క్యా ・?

అటులైన వానినిఁ బేర్కొనుము చూతము.

ఖాదిం--సర్కార్! సునీయే. అహ్నీ, జర్దా, ఫాలూదా, ఫీర్నీ, సేగోష్తా, హాల్వయేబైజవీ, హాల్వయెలగోజా, ఔర్ కనోలే హై.

సర్కార్! పలావ్, కేసరీ భాత్. హాల్వా, కోడిగ్రుడ్ల హాల్వా, పూరీలు మొదలగునవి సిద్ధముగ నున్నవి.

మ. కు-[ఒక్కొక్కరిని చూపి

మిత్రులారా! మీ కేమి

మస్తుచే] ఐ ఆజీజెమః ఆప్కు క్యా చాహియే ?

కావలయును.

ఇబ్ర— ( మత్తుచే ) సర్కార్ సాబ్ కుచ్ ఆబాద్ హై ఆప్ తక్లీఫ్ నహ్యాయియే

బావగారూ! అన్నియుబాదుగనున్నవి. సంపూర్తిగ భుజించితిని. నాకింకేమియు వలదు. దయయుంచి బలవంతము సేయకుండు.

మొ. మి— ( తూగుట నభినయించి ) బందా సైరాబ్ హోగయాహై.

నాను ప్తూర్తి యైనది. (అని తూగుట నభినయించును )

రెం. మి - ముక్కుతో సబ్ కుచ్ తో పేట్ మేహై.

నేనిప్పటికే యెక్కువగ భుజించితిని. నాకింకేమియు వలను. నాయందు దయయుంచి బలవంతము చేయ నక్కరలేదు

మ. కు— ఐ ఖాదిం అచ్ఛా. తుం జాయిమె ఔర్ ప్యారీ గుల్నార్ సాహింగార్ రాహతేజాఁ మనోరంజఁ కాచఁసె మక్బత్లానే కహోమె.

ఐ నౌకర్! నీవు వెళ్ళి తక్షణము త్రిలోక సుందరియు సకలజన మనోహ్లాదినియు నగు మనోరంజఁను మక్బత్ తీసికొని రమ్మనుము. జాగొనరింపకుము పొమ్ము.

ఖాదిం— జీ! హా హాజర్కియా ( అనివంగి సలామొనరించి నిష్క్రమించును. )

చిత్తము. దేవరవారి యాజ్ఞ. ( అని నేలకువంగి సల్లామొనర్చి నిష్క్రమించును. )

ప్రవేశము:— మనోరంజన్ షరబతు కూజాను చేత నిడుకొని
పాడుచుఁ బ్రవేశించును.

హిందుస్థానిరాగము. ఆది తాళము.

ఔర షరబత్! మంచిషరబత్! మెరసె షరబత్!
హృదయ తాపము మాన్పేటి మేటి షరబత్!
సీసాలో మెఱయూచు నున్నా షరబత్! ఔర.

అందఱు— షబాష్! బహుత్ ఖూబ్. బహుబాగున్నది.
సిబాస్.

బాదామిన్ అక్రోటి క్షీరములచే నానా ఫలో ద్రవముల్న్
జేర్చి సువాసనల్ గలిపి దివ్యతరంబుగఁ జేసినారునిన్
ఓ షరబత! చింతసేయకుము నిన్నిపుడిత్తు నవాబు గారికిన్
సఫలము గావె నీకుజన్మమిల సారెకుఁ జెప్పఁగ నేల షరబతా!

అందఱు— (మత్తుచేఁ దూగుచు) బహుత్ ఖూబ్. లేతే ఆయియే మంచిది. తెచ్చి యిమ్ము.

మోహిని మున్ సురాసురుల కమృతము బంచిన భంగి నేను
పంచుచునుంటి మీ మనసు రంజలునట్టుల, దీని మీరు
గ్రోలిన వచ్చుసంపదలు, రాజ్యముగల్గు, జయంబు చేకురున్
ఉత్తమ పానకంబులను గెల్వఁగఁ జాలిన దానిఁ గ్రోలుఁడీ. ॥ఔర॥

( అని నలువురకు గ్లాసులలో వేసి యిచ్చును. )

అందఱు— (త్రాగుచు) షబాష్! బహుత్ ఖూబ్. మనోరంజన్! రఖ్నేకీజియే దిల్ లుభాయిమె.

సెబాస్! మనోరంజన్! బహు బాగుగ నున్నది. మా హృదయతాపము నడంచితివి. ఇఁకఁ గొంతసేపు నాట్య మొనరించి మా మనస్సంతోషమును గావింపుము.

మనో- (నాట్యముచేయును)

చిత్తము. (అని నాట్యము చేయు చుండును.)

మ. కు— ఏ బహుత్ నాజో అదాకీ ఖిలాడీహై.

మిత్రులారా! ఎంతబాగుగ నాడు చున్నదో చూడుఁడు. ఇది బహు మిటుకులాడివలెఁ గన్పట్టు చున్నయది సుమా.

ఇబ్రహీం- క్యా ఖూబ్ రఖ్నా కర్ రహీహై. ఏ ఫరేబిందా మాలూం హోతీహై ఫరేబ్ దేనా చహాతీ

ఔను. బహు బాగుగ నాడు చున్నది. ఇది మాయలాఁడివలె నున్నది. మనలను గూసి తనకు లోఁబఱచుకొనునట్టి సాహసవంతురాలుగ నున్నయది.

మనో- (నాట్యముచేయుచునే పన్నీరుచల్లి తాంబూల మిచ్చును.)

(నాట్యమాడుచుఁ బన్నీరు చల్లి ఆకుమడుపు లందిచ్చును)

అందఱు- (తాంబూలము దీసికొని నమలుచుందురు.)

(తాంబూలమును వేసికొను చుందురు.)

ఇబ్ర-(కొంతసేపూరకుండి) ఐ ప్యారీ! మనోరంజన్! బైక్ జావో. (మహమ్మద్ కులీని

(కొంత నిదానించి) మనోరంజన్! ఇఁకఁ జాలింపుము. అలసినటు లున్నది. (మహా

చూచి) క్యాం జనాబ్! ఔర్ గవయ్యోనె నహీం ఆయా ?

మ్నదకులీని చూచి) బావ గారూ! ఏమి సంగీత పాఠకులు రాలేదా ?

మ. కు - ఐ నౌకర్! గవయ్యోకు జల్దీ బులాలావో.

ఓవరా! సంగీత పాఠకుల రమ్మనుము.

నౌకర్ - జీ! హాఁ! అభీ బులా లాయా (అనిలోనికేగును)

చిత్తము. ఇప్పుడు పిలుచుకొని వత్తును. (అని నిష్క్రమించును.)

మనో - (వంగి సలామొనరించి నిష్క్రమించును.)

(వంగి అందఱికి సల్లామొనరించి నిష్క్రమించును.)

ప్రవేశము:— గాయకుఁడు తగిన వాయిద్యగాండ్రతోఁ బ్రవేశించి, అందఱికి అందఱు వంగి సలామొనర్చి కూర్చుందురు.

మ. కు— అచ్చా! కోయీఁయేక్ ఖుష్ వఖ్తోంకీ గజల్ సునాయియే.

మంచిది కాంభోజరాగమున నేదో యొక మంచి పాటఁ బాడి సంతోష మొనరింపుము.

గాయ-(లేచి) జో హుకుం సర్కార్! (అనికూర్చుండి వాయిద్యముల సృతులను చక్కఁ బరచుకొని పాడుచుండగా, అందఱు హుక్కాను మార్చుకొని మార్చుకొని బీల్చుచు, తూగు

ఆజ్ఞ. దేవరవారి యిష్టమునను సరించి పాడెదను (అని కూర్చుండి వాద్యములఁ జక్కఁ బఱచుకొని పాడుచుండ అందఱు హుక్కాను మార్చుకొని పీల్చుచుఁ దూగుచు మెచ్చుకొని నగుచుందురు.)

ట సభినయించి మెచ్చుకొ
ని నవ్వుచుందురు.)

నౌకర్‌— (ప్రవేశించి సంగీత పాటకుఁడు పాటను ముగించు సమయమును గని పెట్టి ముగించిన తోడనె సల్లాము జేసి) హుజూరె ఆలీ తెబాక్ ఖబలయెఆలా మారాజ్ యెహాకె మహారె గండీకె ఖలేసె, జనాబ్ కార్కూనె పౌజ్ మీర్ జుమ్లా సాహెబ్ బహాదూర్ ఆప్‌కే ఖిద్‌మత్ శాబక్‌కత్‌మె రోహ్హ తహారీర్ కర్‌కర్ కిసీ యాక్సె రవానా కియాహై. ఒహాందర్వాక్ హాజర్ హువాహై. సర్కార్‌కా హుకుం హోతో వుస్కూ హాజర్ ఖిద్‌మతె కర్తా హుమ్.

[ ప్రవేశించి గాయకుఁడు తన పాటను పాడుట చాలించు సమయమును గనిపెట్టి, వెంటనె వంగి సల్లా మొనరించి] మహారాజ్! తమ సేనాని మీరుజుమ్లా సాహెబ్ గండికోటనుండి వార్తావహుని వెంట నొక కమ్మనొసఁగి పంపియున్నాఁడఁట. అతఁడు వచ్చి తమ దర్శనార్థము కాచుకొని యున్నాఁడు. దేవరవారి సెలవైనచోఁ బంపుచున్నాను.

మ. కు— అచ్ఛా! జల్ద్ ఆనే కహాంో.

మంచిది. తక్షణము రమ్మనుము.

నౌకర్‌— జో హుకుం. (అని లోనికేగును.)

చిత్తము. [ సలాముచేసి లోని కేగును. ]

పునః ప్రవేశము:- సేవకుఁడు వార్తావహునిఁ బిలుచుకొని వచ్చును. వార్తావహుఁడు సలామొనర్చి లేఖ నొసఁగును.

మ. కు- [చదువుకొని ఇబ్రహీం అడిల్ షాకొసఁగ నతఁడు చదువుట నభినయించుచుండును.] అచ్ఛా. [సేవకుని జూచి] యీస్కో సాహెబ్ కీ ఖాతిర్ తవాజో కీజియే ఔర్ చలా దీజియే. [ఇబ్రహీంను జూచి] జీ! ప్యారే! నిస్బతీ బిరాదర్! హంభీ ఫౌజ్ కా భారీ దస్తా లేకర పెనుగొండేకె తరఫ్ జానాహై. క్యోంకే పెనుగొండేకె తిరుమల్ రాజ్ సే హమారె మీర్ జుమ్లాసాహెబ్ లష్కర్ కు లేకర్ ఖలే గండీకా మొహాసిరా కర్ రహేహై.

[చదివి ఇబ్రహీం అడిల్ షా కియ్యఁ నతఁడు చదువుకొనుచుండును] మంచిది [తలయూచి] సేవకా! [వార్తావహుని జూపి] ఇతనికి నన్నపానాదులచే విచారించి పంపుము. [సేవకుఁడు క్రొత్తవానిని దీసికొని పోవును మహమ్మదుకులి యిబ్రహీమును చూచి] ఇబ్రహీంజీ! నేనుగూడ సైన్యసమేతుఁడనై పెనుగొండకేగ వలసి యున్నది. ఏలయన తిరుమలరాజు స్వాధీనమందుండు గండికోటను మా సేనాని మీరుజుమ్లా ముట్టడించి యున్నాఁడు. తిరుమలరాజును గండికోటవారికి సహాయము రాకుండ ఆపి వేయవలయును.

ఇబ్రహీం- అ-హా. వైసాహై. అచ్ఛా. ఆప్ కీ కుమక్ కే లియే మైభీ పెనుగొండా

అ-హా. అలాగా [అని తలయూచి మీసము దిద్దుచు] అటులైన నేనుగూడ నా సై

అప్నాగా. ఉస్ తిరుమల్
రాజ్ బద్మాష్‌కు తెహే
తేగ్ కర్‌దూంగా బద్మా
ష్! హిందూరాజోఁకి బీఖ్
కని కరూఁగా. హమారే
రే ఆబాఒ అజ్‌దాద్
జో సజా. ఆగే దియే ఓ బ
సర్నా ఆయీహాయద్. ఓ
రామరాజ్ కా భాయీ ఆ
జ తుమారేపర్ చడ్
కే ఆయాకియా. కల్ హంప
ర్ భీ ఆనేవాలాహై ఇస్
కీ బీఖ్‌కని బేహతర్ హై.
హమ్ దోనో మాఁ పెను
గొండా జాకర్ ఫిస్కీ-
ఖూబ్ రేజ్ కర్‌కర్ గండీకె
ఖ్ లేకు మదత్ నహీ ఆయే
సరీకా బందిష్ కర్నా చా

నృమును దీసికొని మీకు స
హాయముగాఁ బెనుగొండకు
వచ్చెదను. ఆ పోగరుబోతు
తిరుమలరాజును నా కరవాల
ముచేఁ గడికండలఁ గావించెద
ను. హిందూ నృపాలుర వంశ
నాశన మొనరించెదను. మన
తండ్రులు వారి వంశమువారి
కొనరించిన శిక్ష చాలలేదు
కాఁబోలు. మనవారు “విజయ
నగర వినాశముఁ జేసినటుల,
మనమీ “ గండికోట వినాశ
ము”ను గావించి, ఆ నీచ చం
డాలాధముండగు తిరుమలరాజు
రూపు మాపవలయును. ఆ
రామరాజు సోదరుఁడు యీది
నము మీ మీఁదికి వచ్చెను.
రేపటిదినము మాపైకి వచ్చుట
కేమియు సందేహింపఁడు. వీని
వంశనాశనముఁ జేయుటయే
బాగు. మన యిరువురము కలి
సి పెనుగొండ కేగి వాని రూ
పుమాపి గండికోటకుఁ బోకుం
డ జేయ వలయును.

మ. కు- అచ్ఛా. బహుత్ మంచిది. ఆలాగె వెళ్లుదము.

ఖూబ్ చలీమె. జాలింగా
ఖూఁ దమేషంషీర్ పర్
లగాయియే. ఫౌక్ కీమాఁ
తయ్యారీ కీజియే

వాని కంఠరక్తమును జూడఁగా
నక తప్పదు. ఇఁక సైన్యమును
సిద్ధముఁ జేయఁ బోవుదముపద.

(అని నిష్క్రమించును.)

# ద్వితీయ రంగము.

ప్రవేశము:— పెనుగొండ యాస్థానమునఁ దిరుమలరాయఁడు మంత్రితో నాలోచించు చుండును.

తిరుమల—సచివాగ్రణీ! నాచేఁ గష్టపెట్టఁబడిన వారందఱు గోలకొండకేగి మహమ్మద్‌కులీయొక్క మొఱఁ బెట్టుకొనిరో లేదో. ఆ పారశీకునకు నా చర్యలు తెలిసియే యుండిన పోరునకు రాక యుండి యుండఁడు. పిఱికి పంద వాఁడేమి చేయఁ గలఁడు.

ఉ॥ చంపితి నే ఫకీరులను
చావఁగఁ గొట్టితిఁ బారశీకులఁ
బంపితి నశ్వవర్తకులఁ
బారశికాధము నద్ద మూల్యముఁ
నింపెసలార నారమణి
నిడ్చి ముసుంగును దీసి వైచి తిఁ
డెంపును జేసి, రారయిరి
దీనులు యుద్ధముఁ జేయఁ జాలకే.

ఇంత యెూర్చినను బవరమునకు రాక యుండుటఁ జూడ నానీచ తురుష్కాధముండగు మహమ్మద్‌కులీ మదీయ బహుబల పరాక్రమ విక్రమంబులకు భీతిల్లి జడిసినటు లున్నది. ఇపుడుగదా యా చండాలులకుఁ దిరుమలరాయల నామంబన్న స్వప్నమున సహితము భీతిఁ గొల్పుచున్నయది. కానిమ్మింతటితోఁ బోనిత్తునా?

మంత్రి:—రాయలవారూ! మనమిప్పుడె తురకలు యుద్ధమునకు రా వెఱచిరని తలంపరాదు. వీరా కొనరించినవి యమానుష కార్యములు. బాధింపఁబడిన వారేగి గోలకొండలో మొఱఁ బెట్టుకొనక యుండరు మహమ్మద్ కులీ వారి పలుకులను వినియే యుండిన మనమీఁద దాడి తప్పక వెడలును. మన మిప్పుడె వారు యుద్ధమునకు రాలేదని సంతసింపఁ బనిలేదు.

తిరుమల:—ఏమీ. ఆ దురాత్ముఁడు మనపైకి యుద్ధమునకు వచ్చునని నమ్మెదవా? ఈ తిరుమలరాయలచేత హతముగావలెనని వాని నుదుట విధి లిఖంచియుండ మనమేమి చేయఁ గలము.

మంత్రి:—రాజా! అది మనమెటుల నిర్ణయింపఁ గలము. మనము మాత్రము తగిన సన్నాహములతో జాగ్రత్తగా నుండవలసి యున్నదని నా మనవి.

తిరుమల:—మంత్రిసత్తమా! ఏమిటుల భయపడియెదవు.

మ॥ ఖలు చండాలు దురాత్ము నీచు తులువన్
గామాంధు నిర్భాగునిన్

బలువఁగ ద్రోహులు మదాంధు నాకుటిలు బల్
పాపాత్ము గోహంతకుఁ
నిలువఁగ రాష్ట్రమునందు నిత్తును వెసఁగ
నేర్పుఁగ భుజా శక్తినిఁగ
దెలియఁగ జేయక రూపు మాపకయె నా
దేశంబు కీర్తింపఁగ.

అస్మదీయ కృపాణధార కాహుతి యగుశత్రుల విధాత
లలాటమున స్పష్టముగ లిఖించియుండ నా మ్లేచ్ఛాధముండేమి
చేయఁ గలఁడు. ప్రళయకాలాభీల దుర్దాంత దార్వ హవ్య వహ్ని
జ్వాలల మించు మదీయ వేఁడి చూపుల సైఁప గలఁడా యీ
పిఱికి తురక. ఘోర మదమత్త జీవాళి పాలి కాలానలంబగు
శంకర శూలమును మించు మదీయ కుంతాగ్నిజ్వాలల ధాటి కో
ర్వఁగలఁడా యీబానిస తొత్తుకొడుకు. కాకోదర లోకేశ శ్వసన
ఘూత్కార సముద్భవ తీక్ష్ణ కాకోల కీలా సహస్రంబు లొక్కు-
మ్మడి కాయము నావహించి బాధించు బాధను తృణప్రాయ
ము గావింపఁ గలిగి మద్బాహాగ్రముల నలంకరించియున్న
(ఖడ్గమును జూపుచు) యీ కృపాణము తన నీచ కంఠమును
ద్రవ్వనేయఁ గలిగెడి బాధ నోర్వఁగలఁడా యీ పారశీకాధ
ముఁడు. విజయనగరసామ్రాజ్యాధీశుల నిశితకృపాణ ధార
చవిఁ దెలియంజాలక మందబుద్ధి తన్నావరించియుండ మనల
జయింపవలెనను కుతూహల సమన్వితుఁడై యేతెంచు మహా
మ్మద్ కులీ, నన్ను జంద్రధ్వజుల వంశనాశన మొనరింపను,
గోలకొండ మహాకల్మష శరీరుల నిట్టనిలువున దహించి బూడి
ద యొనరింపను రామభూపాలుని సోదరుఁడుగ జన్మించిన

యపరావతారుఁడని యెఱుఁగవుకాఁబోలు. అమాత్యశేఖరా!
నరకమున శమనునాజ్ఞ ననుసరించి,

సీ॥ పరసతి గమనంబు ♦ బలిమిమైఁ జేసిన
దుష్టుల నగ్నిలోఁ ♦ ద్రోయు నట్టి
కూటసాక్ష్యములిచ్చు ♦ కూళల నోటిలో
ఘోర సూలంబులఁ ♦ గ్రుచ్చు నట్టి
జీవహింసలఁ జేయు ♦ చెనటుల కుత్తుకల్
కటకటఁ గత్తిచేఁ ♦ దఱుగు నట్టి
విషమిచ్చు వారిని ♦ వెలికిలఁ బడఁద్రోసి
తగరంబుఁ గ్రాగించి ♦ త్రాపు నట్టి
పతిని హింసించిన ♦ భామలఁ గళవెళఁ
గ్రాగెడి నూనియఁ ♦ గాల్చు నట్టి
పసిపాపలను గని ♦ పాముబొన్రల వేయు
నారుల నీఁటెపై ♦ నాటు నట్టి

తే॥ గీ॥ వజ్రహృదయుల గుండియల్ ♦ పగులఁ జేయు
సాహసము గల్గినట్టి యా ♦ శమను భటులఁ
బట్టి తేఁగల యట్టి నా ♦ భటులు గలుగ
మనము భీతిల్ల నేల న ♦ మాత్య వర్య!

మహా సంగ్రామమున నిందు మగంటిమిగుల హిందూ యోధాగ్రేసరులు బైకొన్నపుడు ప్రాణాలపై నాసచే, మానావమానములఁ బోనాడి, కాలిగి బుద్ధిచెప్ప నా పిఱికిపందలు యుద్ధమునకు వత్తురని భయపడకు సుమా.

మంత్రి:—మహమ్మదీయులకు వెఱచితి నని మీరనుకొంటిరి కాఁబోలు. అటుల భావింపకుఁడు. మన మజాగ్రత్తగ నుం

డక తగిన సన్నాహములతో నుండుట బాగను నభిప్రాయ మున నటులంటిని.

ప్రవేశము:—సేవకుఁడు.

సేవ:—(వంగినమస్కరించి) మహాప్రభూ! గండికోట నుండి తమ సామంత ప్రభువగు తిమ్మానాయుఁడు గారు కమ్మరు వ్రాసి మనుష్యునిచేఁ బంపి యున్నారు. దేవరవారి సెల వైనచోఁ బిలచుకొని వచ్చెద.

తిరుమ:—(సేవకుని జూచి) త్వరితముగఁ బంపుము. (మంత్రి తో) మంత్రీ! తిమ్మానాయుఁడు కారణము లేక కమ్మరు వ్రాసి యుండఁడు. కారణ మేముండునో.

మంత్రి:—తొందర పడనేల? పత్రమును జూచిన బయలఁ పడును గదా.

—♦—

ప్రవేశము:—సుదర్శననాయుఁడు.

సుదర్శ:—(నమస్కరించి కమ్మనొసఁగి ప్రక్కన నిలచును.)

తిరుమ:—(జాబును చూచి, కన్నులెఱ్ఱజేసి మీసముదిద్ది తల యూచుచు నిలిచి)

మ॥ పలువా! నీచకులాధమా! వినవె నా
వాక్యంబునుం తేని నీ
విలలో నుండఁగఁ జాలవింకఁ గనుని
న్నీనాడెఁ బ్రమందించెదన్
నిలువన్ జాలకఁ బాటిపోకుమురా
నే నిప్పుడేవచ్చి నీ

యులుకుఁ బాపఁగ లేక పోయినను నే
నుర్వీ మహీశుఁడనే.
(తు రాం)

మంత్రి:—(లేచి నిశ్చేష్టపాటునఁ జూచుచుండును.)
సుదర్శ:—(ఒదిగి యుండును.)
తిరుమల:—(కోపముతో) ఓరి! నీచమహమ్మదీయకులపాంశనా! అనిర్వచనీయ కలుషాత్మా! నిర్నిమిత్త విరోధంబు బెంచి నిష్కారణ వైరమును గల్పించి మదీయ సోదరుఁడగు రామభూపాలుని మోసకృత్యమున జయించిన యధముండగు నీ తండ్రితోఁ జేరి ద్రోహి నన్ను జయింపఁ దలఁచితివా. ముఖాముఖని హోరాహోరీఁ బోరినఁ గదా మీ పసగాన నయ్యెడిని. అధమా! ఘోర దుర్దాంత దురంత దుస్తరతమ గంభీర కఠోర కల్మషా నిన్ను నంత దవవహ్ని కీలల నిర్ధూమధామంబొనరించినను; కర్త వ్యాకర్తవ్యతా విచారంబుఁ బోనాడి వృక్షాగ్రంబున నధోముఖంబుగ వ్రేలఁగట్టి ముక్కలు ముక్కలుగఁ జెండి వాయసంబులకు వేసినను పాపము వచ్చునా? మ్లేచ్ఛకులాధమా! రణావనిని మదీయ దీర్ఘనిశిత కృపాణధారచే నీ శిరమును ద్రెళ్ళవేసి, యుత్తరపినాకినీ సైకతస్థలిఁ గాల్చంబడగ నొనరించి మదీయ సైనిక తతిచే నాడించి సంతసించెదఁగాక. కానిమ్ము. (అర్ధోక్తి.)
మంత్రి:—మహాప్రభూ! తమ యాగ్రహ కారణంబు మాకొక్కింత వినిపింపుఁడు. కానున్నది కాక మానదు.
తిరుమల:—(జాబును ముందటఁ బడవైచి) చూడుము.
మంత్రి:—(చదువును.)

గండికోట.
15-6-1652.

స్వస్తిశ్రీ తిరుమలరాయల వారి సన్నిధికి,

గోలకొండనుండి మహమ్మద్ కులీ కుతుబ్ శాహా తన ముఖ్యసేనానియగు మీరుజుమ్లానుగొప్ప సైన్యముతోఁ బంపి యున్నాఁడు. సేనాని మన దుర్గమును ముట్టడించి యున్నాఁడు. గనుక తగిన సైన్యమును దీసికొని మాకు సహాయము రాకున్న గండికోట మనది కాఁజాలదు.

చిత్తగింపవలెను.

తిమ్మానాయుఁడు.

గండికోట పాలెంతిరిభవు.

తిరు:—మంత్రిసత్తమా! నేఁడే సకలసైన్యమును గండికోట కేగవలయును. సేనాధిపతితో సైన్యమును సిద్ధముచేయుమని చెప్పి పంపుము. ఆలశ్యము చేయవలదు. నేనంతఃపురమున కేగి ప్రయాణమై యేతెంచెద. మిక్కిలి సులుకుగఁ బని చేయవలయును.

(అని నిష్క్రమించును.)

# తృతీయ రంగము.

ప్రవేశము:—వేంగళాంబ తన శయన మందిరమున నాసీనయై చింతించు చుండును.

వెంగ:—(దుఃఖముతో) ఔరా! నేఁడెట్టి దుర్దినము. ఎన్నఁడును

పగటి నిదుర నెరుంగని దానను నాకు నేఁడీ పాపినిదుర యేల రావలయు. ఒకవేళ వచ్చినను ఆ పాడుకల నాకేల వచ్చె. (భయము నభినయించి) అబ్బో! ఆ స్వప్నము నాకు జ్ఞాపకము వచ్చిన దేహము కంపించుచున్నయదే. కల సత్యమగునా? కల్ల. నా పతియైన దగ్గఱ నుండిన నొక్కింత ధైర్యమును చెప్పి యుండునే. వారింకను రాకుండుటకుఁ గతం బేమి? అనుదిన మీవేళకు వచ్చు నాపతి నేఁడింకను రాకుండుట కేదియో కారణముండి యుండును. (యోజన నభినయించి) ఏమిది. దీనికిఁ దోఁడు నా కుడికన్నదరు చున్నయది. ఏమి విపరీతము జరుగనున్నదియో కదా. (వినుట నభినయించి స్వగతమున) ఎవరో వచ్చినటులున్నది. (ప్రకాశముగా) ఎవరచ్చట.

తిరుమ:—(లోపలనుండి) కాంతామణీ! రావచ్చునా?

వెంగ:—(ఎదురేగి) నాథా! రండు. మీ కొఱకే యెదురు చూచుచుంటిని గదా.

తిరుమ:—ప్రాణప్రియా! ఇపుడు సావకాశముగ మాటాడుటకు వ్యవధి లేదు. మన గండికోటను ముట్టడించి యున్న గోలకొండ సైన్యమును రూపుమాపుటకు సైన్యసమేతుఁడనై వెళ్లుచున్నాను. సైన్య మప్పుడే ప్రయాణమై వెళ్లుచున్నయది. నేనశ్వారూఢుఁడనై వారిని గలిసికొనవలెను. నే వెళ్ళెద. నీ విచ్చట జాగ్రత్తగ నుండుము.

వెంగ:—(చేతులఁ బిసికికొనుచు) అయ్యో! నాథా! నా కల నిజమయ్యెనే. (దుఃఖము నభినయించి) అకటా! ఇంకేమి చేయవలెను. మన కెవరు దిక్కు.

తిరుమ:—ప్రాణేశ్వరీ! ఏమి. కలయా? ఏమని కలఁ గాంచితివి?

వెంగ:—ప్రియా!

తే॥ గీ॥ పగతు రేతెంచి ననుఁ జెఱఁ ♦ బట్టి నటుల
ఖండనమ్మున మిమ్ము నేఁ ♦ బాలు చూడఁ
దళము చెండిన తురకల ♦ దాసు నౌను
గాంచి నట్టులఁ గలనాథ! ♦ గాంచి తకట!

తిరుమ:—ఉ-అంతయేనా. కలలు సత్యములు కాఁజాలవు. నీవు భీతిల్లకుము

వెంగ:—నాథా! నాకు ధైర్యము చెప్పుటకు మీ రటులనుచు న్నారు గాని వేఱుకాదు. నా స్వప్నము నిశ్చయము మనకుఁ యుద్ధము తటస్థించుట సాక్షి కాదా? అయ్యో! నాథా! మనకుఁ జెట్టని దినములు కలిసి వచ్చునటులున్నది కదా. అయ్యో! మీతోఁ జెప్పమఱచితిని. నా కుడికన్ను కేలి యదరు చున్నది కదా. అబ్బా! నా గుండియలు కొట్టుకొ ను చున్నయవి. నా దేహము నాకే బరువై కంపము గా చున్నయది. నాథా! మీరు నా చెంగట లేకున్నఁ గష్ట ము. మీరు లేకున్న నే నుండఁ జాల.

తిరు:—సఖీ! ఏ మటులఁ బల్కెదవు. నీకు మతిపోయినదా? పగతులు కోటను ముట్టడించి యున్నారు. సైన్యము లేగు చున్నయవి. ఇట్టి సమయమున నే నిన్నుఁ గనిపెట్టుకొని యుండినఁ బగతు రూరకుందురా. లేనిపోని యాటంక ములఁ జెప్పక నన్నుఁ బోనిమ్ము.

వేంగ:—నాథా! అటులైనచో నన్నుగూడ మీ వెంటఁ గొని పొండు. పిల్లవాండ్రను గనిపెట్టుకొని నే నొంటరిగ నుండఁ జాలను.

తిరు:— మానినీ! నీకు నిక్కముగ మతి పోయినది. పరిహాస మునకిది యదను గాదు సుమా.

వేంగ:—నాథా! నేను పరిహాసమున కనుచుండ లేను. నిక్కముగ నే నొంటరిగ నుండనోప.

తిరు:—సతీమణీ! నేను ఘోరయుద్ధమునఁ బాల్గొన నేగుచుండ; అబలవు నా వెంటవచ్చి యేమి చేయనెంచితివి. నారీమణీ!

సీ॥ ఆటలాడగ మనో ♦ హర వనంబది కాదు
కఠిన మ్లేచ్ఛులుగల్గు ♦ కదన భూమి
సఖులలో జలకేళి ♦ సవరించుటయుఁ గాదు
పారశీకుల తోటి ♦ ఘోర రణము
పతి మోహమున వేయఁ ♦ బట్టు బంతులు గావు
ధామ్మని తగులు ఫి ♦ రంగి గుండ్లు
వీనుల వినఁగీర, ♦ వీణా, రవము కాదు
ఖడ్గ కర్ణణముచేఁ ♦ గలుగు రవము

తే॥ గీ॥ హరిణములతోడ నాడెడి ♦ యాట గాదు
మతవిరోధులతోఁ జేయు ♦ మత కలహము
కాంత నీవేడ యవనుల ♦ కదన మేడ
పోయివచ్చెద నిలుపుము ♦ పువ్వుబోఁడి.

నాగవేణీ! యుద్ధభూమి మిక్కిలి భయంకరము. తుపాకులు గాల్చువా రొకవంకను, ఖడ్గములఁ జేకొని పైబడు వీరవరు లొకదిశను, ఈఁటెలచేఁ గ్రుచ్చువా రొక ప్రక్కను, అశ్వముల నారోహించి భీకరాకారులై పగఱఁ గని హుంకరించుచుఁ బైఁబడు యశ్వసైనికు లొకవైపున, గుంజర

యూధము లోకలేట్టును, పైఁబడ నుంకించుచుండ వారి ప్రయోగములను దప్పించుకొని శాత్రవుల హతమొనరింప వలసి యున్నది. అట్లు చేసి నీవు నా ప్రక్క మన పుత్రులతోఁ గూడ నుండిన నాకు దిక్కులోఁపక శత్రువుల బారిఁ బడవలసి వచ్చును. ఆ భయంకర స్వరములను, ఫిరంగుల మ్రోతలను, ఆ భీకరాకారములను మీరు చూచిన సహింపలేరు. నీవు నా మాటకు బదులాడక యిందే యుండుము. నేఁబోయివచ్చెద.

(అని నిష్క్రమించును.)

వేంగ:—(తొందరతో) ఏమి. నాథా! నా మాటను ద్రోసిపుచ్చి వెడలితిరా. అకటా! ఇఁక మాకు దిక్కెవ్వరు. అయ్యో! నే నొంటరిదాననైతినే. సర్వలోకరక్షకా! నా నాథునిఁ గాపాడుము. ఆయన దర్శనము నాకుఁ ద్వరలోఁ గలుగునటులఁ బ్రసాదింపుము. నా ప్రార్థన నాలకింపుము. నాకుఁ బతిభిక్ష నొసఁగుము. కానిమ్ము. అన్నిటికి నాకు దిక్కు నీవు దక్క నితరులు లేరు. (యోచించి) బాలకులేమి చేయుచున్నారో చూడఁబోయెద.

(అని నిష్క్రమించును.)



# చతుర్థరంగము.

ప్రవేశము:—గోలకొండ నవాబు మహమ్మద్ కులీ కుతుబ్ శాహా బిజాపూరు నవాబుతోఁ గూడ సైన్య సమేతుఁడై పెనుగొండ దుర్గమును బ్రవేశించును.

సైనికులు:—దీన్ దీన్. హిందువు లెక్కడ. తిరుమలరాజెక్కడ. మారో. మారో. (అని తొందర చేయుదురు.)

మ. కు:—సైనికులారా! ఏ మీపట్టణమున సైన్యమే లేఁటు లున్నది. తిరుమలరాజునకు సైన్యములే లేవా. లేకున్న మనతోటి కయ్యమునకు, బూనుకొనునా? వీరల సంగతులు మన కేమియు బోధపడుట లేదు. (యోజించి) ఔను, అటులనే యుండును. మన సేనాని మీరుజుమ్ములా వ్రాసినటుల తిరుమలరాజు సైన్య సమేతుఁడై గండికోట కేగి యుండును. తిరుమలరాజును గండికోటకు సైన్యముతోఁ బోకుండఁ జేయవలెననుకొన్న కాకపోయెను. తిరుమల రాజు లేని యీ పెనుగొండలో మనమేమి చేయవలెను, సైనికులారా! మనకు వ్యవధి చాల లేదు. మీరేగి త్వరలోఁ బట్టణము నంతయుఁ దోఁచుకొని రండు. పొండు. ఆలస్య మొనరింప రాదు. ఇదే నా యాజ్ఞ. (ఆడిల్‌ఖాను చూచి) మన మంతఃపురమున కేగి తిరుమలరాజు బంధువులున్న చెఱఁబట్టి గండికోట కేగుదము. (సేనాధిపతితో) సేనాధిపతీ! అంతఃపురమునకు మార్గముఁ జూపుము.

సేనా:—చిత్తము.

ఆసిల్:—తమ స్త్రీల చెఱఁబట్టి యవమానపరచినఁ గాని, మహమ్మదీయ మానినులను భంగపఱచిన తిరుమలరాయులకుఁ దెలివి రాదు. మహమ్మదీయులన్న మానహీనులని యతని యభిప్రాయము కాఁబోలు. ఇపుడు తెలియఁ గలను లెమ్ము. (నిష్క్రమింతురు.)

ప్రవేశము:—(యవనిక నెత్తఁగా) వేంగళాంబ అంతఃపురమున దుఃఖముతోఁ గూర్చుఁడి యుండును.

వేంగ:- మ॥ అకటా! యేమనుదాన నా విధిని నా
కయ్యయ్యో! దిక్కెవ్వరో
సకియల్ పోయినవారు రారయిరి యీ
జాగేలనో వారికిన్
వికటించెన్ గద కాలమిప్పటికి నా
భీతిన్ మనో దుఃఖమున్
ఇఁక నెవ్వారలు పాపఁ జాలుదురు నే
నిశ్శ్లతి నో దుర్విధీ.

అక్కటకటా! నా విభుఁడు నన్ను వదలి వఁడద్దును సమరమున కేగెఁ గదా. పట్టణమా సైన్యరహితము, సేనాయబలను, పుత్రులా యర్భకులు. ఇట్టి సమయమును గనిపెట్టి దుర్మార్గు లెవరైనఁ బట్టణమును బ్రవేశించిన మా గతి యేమగునో కదా. (వినుట నభినయించి) ఔరా! పట్టణమున నేమో విపరీతము జరుగుచుండినటు లున్నది. నా చెలులు రాకుండుట కిదియే కారణమై యుండును. అయ్యో! నా దేహమంతయు వడఁకు చున్నయది. అబ్బో! నా కపరిమితమగు

భయమగుచున్నది కదా. ఈ యపశకునము లన్నియు నా కేదిరెయో ముప్పుఁ దెచ్చెడిలాగుఁ దోఁచెడిని. లోకరక్షకా! నన్ను రక్షింపుము. నా పతినిఁ గాపాడుము. హా! (అని పడకపైఁ బడును)

ప్రవేశము:—శ్రీరంగరాజు వీరవేంకటపతిరాజు లోపల నుండి పరుగెత్తుకొని వత్తురు.

వీ. వేం:—అన్నా! అమ్మ యెచ్చటి కేగెను?

శ్రీరం:—ఏమో కనఁబడ లేదె. ఎచ్చటికిఁ బోయి యుండును.

వీ. వేం:—నే నింట వెదకితిని. లేదు. నీవు వెలుపలికేగి చూచి రమ్ము. నే నిందే యుండెద.

శ్రీరం:—పోరా. నీ వెప్పుడు వెదకితివి. నేను నీ వెంటనే యున్నానే.

వీ. వేం:—అవునురా. వెదకి యున్నాను. నీకుఁ దెలియకుండ వెదకినాను. బయట వెదకుట నీవంతు.

శ్రీరం:—(అటునిటుఁ జూచి వెంగళాంబ పరుండి యుండుటఁ జూచియుఁ జూడనటుల నటించి) నేనే యింటిలో వెదకెదను. నీవే బయటఁ జూచి రమ్ము.

వీ. వేం:—అబ్బే. ఇంటిలో లేదురా. చూచిరమ్ము. (అని త్రోయును.)

శ్రీరం:—నేనుఁబోను నీవే పొమ్ము.

వీ. వెం:—సరి. అమ్మను రానిమ్ము. చెప్పి కొట్టింతును.

శ్రీరం:—పోరా. నీవు కొట్టించిన నాచేతఁ గాదా.

వీ. వే:—కానిమ్ము (అని వేలితో బెదరించును) నేఁబోయి

నీమీఁద చాడీలను గల్పించి, అమ్మను పిలుచుకొని వచ్చి బాగుగఁ గొట్టింతును చూడుము. (అని నిష్క్రమించును.)

శ్రీరం:—సరి. పొమ్ము. (తల్లి దగ్గఱకేగి) ఆమ్మా! అమ్మా! ఇపుడేమి నిద్ర లేవవే.

వేంగ:—(పలుక కుండును.)

శ్రీరం:—అమ్మా! పలుకవేలనే. మా యయ్యతోఁ జెప్పెదను. జూడుము. మా తండ్రి యెచట కేగెనే. (అని తెలుపఁ బోవును)

వేంగ:—(ఊరకుండును)

పునః ప్రవేశము:—శిరసేనాపతిరాజు.

సి. వేం:—అమ్మ లేదురా యేమిచేతము.

శ్రీరం:—ఎందుకు లేదు. నీవు వెదకలేదు. ఊరక వచ్చి యున్నావు.

సి. వేం:—(అమాయకత్వమును నటించి) చూడు. నిజముగ వెదకితిని.

శ్రీరం:—ఇంటిలో వెదకితివా.

సి వే:—ఓ. వెదకితిని లేదు.

శ్రీరం:—నిజమా.

సి. వే:—నీవలె బొంకువాఁడ ననుకొంటివా?

శ్రీరం:—అవును. పాపము. నీవు బొంకనే బొంకవు. అయిన అమ్మ యింట లేనేలేదా?

సి. వెం:—లేదు.

శ్రీరం:—చూపిన నేమిత్తువు.

సి. వెం:—చూపుము.

శ్రీరా:—పందెము వేయుము. చూపెదను. (అని తెలియకయే తల్లినిఁ జూడఁగా)

పీ. వే:—(కనిపెట్టి) నీవు చూపవద్దు. పన్నిదము వలదు లెమ్ము (అని పరుగిడి తల్లిపైఁ బడును.)

వేంగ:— ఊఁ. (అని మూలుగును.)

పీ. వే:—అమ్మా! అమ్మా!

శ్రీరా:— ఇంకను బలుకవేలనే.

తే. గీ॥ అమ్మ మాయయ్య యెచ్చటి ♦ కరిగె నమ్మ!
యెవరికి కేగెనొ చెప్పవ ♦ దేమి కమ్మ!
యేమి యయ్యెను దుఃఖింప ♦ నేల నమ్మ!
పలుకకుండిన మేమెట్లు ♦ నిలుతు మమ్మ!

వేంగ: —(లేచి కన్నులఁ దడియొత్తుకొనుచు) నాయనలారా! మీ నాన్నగారు వలదన్నను యుద్ధమున కేగినారు.

పీ. వే:—ఏమి. యుద్ధమునకా

ఆ. వె. ఎవరితోడఁ బోరు ♦ నేగె, నెచ్చటికమ్మ!
పగతు లెవరొ వేగఁ ♦ బలుకు మమ్మ!
పట్టి తెత్తునిపుడె ♦ బంధింతు ఖండింతు
చూఱకత్తిఁ దెత్తు ♦ చూడు మమ్మ.

(నిష్క్రమించును.)

ప్రవేశము:—గోలకొండ మహమ్మద్ కులీ కుతుబ్ శాహా. బిజపూరు ఆడిల్ షా, సేనాధిపతి ఒకరివెంట నొకరు వేంగళాంబ యంతఃపురమును ప్రవేశింతురు.

వేంగ:—(నివ్వెరపడి లేచి) అయ్యా! మీ రెవ్వరు? అంతఃపుర

మున స్త్రీలుండరనియు, పురుషులు ప్రవేశింపరాదనియు తెలియని మూఢులుగ నున్నారే. ఛీ ఇచటినుండి పొండు.

మ. కు:—మేము మూఢులము గాము. మిమ్ములఁ బట్టి గొంపోవ వచ్చితిమి.

వేంగ:—ఏమీ! నను బంధితురాలినిగ నొనరింతువా అది నీచేనగునా?

సీ॥ పూజ్యురాలై యున్న ♦ భూపుత్త్రిఁ గొంపోయి
రాయిడి జెందఁడే ♦ రావణుండు
పావనవతియగు ♦ పాంచాలి మోహించి
చేరఁడే నరకంబు ♦ సింహబలుఁడు
తగదని యెంచక ♦ తారను గవిసితాఁ
గళలఁ గోల్పోవఁడే ♦ కమలవైరి
తులువయై నలురాణి ♦ తోఁగూడఁ దలఁచియు
బూడిద కాలేదె ♦ బోయవాఁడు

తే. గీ॥ శీలమతులను బలిమిని ♦ చెఱుపఁ గోరి
క్రూరులెందఱో పూర్వము ♦ కూలినారు
చెడుపఁ గోరకు పరులను ♦ జెడుదు వీవె
వలదు ననుబట్టఁ జెడుదువు ♦ వలదు వలదు.

ఆడిల్:—ఆ నీతులు మీ వారికిఁ గాని మాకుఁ గాదు.

వేంగ:—ఔరా! యబలలఁ జెఱఁ బట్టుట మీ రింకను మాన లేదా. మానినీవతంసముల మానము దీసిన హిందూ మహమ్మదీయ వంశసమితి భస్మీభూతమైనది మీకుఁ దెలియదా. ఇప్పటికైనను దెలివిఁ దెచ్చుకొని బ్రతుక రాదా, మగవారు లేనితతి భామినుల కడఁ జేరి బంధించుట సరి

యని మీ శాస్త్రమున వ్రాసి యున్నారా? జరిగిన సంగ తులను మనస్సునకుఁ దెచ్చుకొని జీవింపరాదా. క్షత్రియ కులాంగనల మానములఁ గొనవెంచి మీ తురుష్క చక్ర వర్తులు నిర్మూలము కాలేదా. విద్యావిహీనుఁడవై మీ పూర్వుల చారిత్రములఁ జదివితివో లేదో. ఇపుడైన దెలిసి కొనుము. ఎన్నఁడో జరిగిన వానిని దలంచు టెందులకు. మొన్న తాళికోట యుద్ధమునకుఁ బూర్వము మా రామ భూపాలుఁడు నిండు సభాంతరమున మహమ్మదీయ మచ్చ కంటిని ముసుఁగు దీసి యవమాన పఱచినందునఁ గదా దాని ఫల మనుభవించెను. దానిని మీ రెటుల మరచితిరి. పరాంగనల భంగపఱచు మహమ్మదీయులుకాని, హిందు వులు కాని, తదితరులు కాని తప్పక నశింతురు. నా మాట బాగుగ వినుఁడు. మీరు లేని సమయమున మీ గోషా మందిరముల జొచ్చి మా వారు మీ సతుల మానములఁ గొనిన మీరు సమ్మతించి యూరకుందురా? మమ్ముఁ గూడ మీ సతులవంటి శీలముగల వారని తలంపరాదా? ఘోర యుద్ధమునఁ బాల్గొని మీ మహమ్మదీయమ స్తక ములఁ ద్రెంచుట కేగిన మదీయ ప్రాణకాంతునితో యుద్ధ మును జేయఁ జాలక యబలనగు నన్నుఁ బట్టి వచ్చితివా. నీవు శూరుఁడవేని రణరంగమున మా వారిని జయించి వచ్చియుండిన నిన్నొకింత మెచ్చవలసి యుండెను. పరమ సాధ్వీమణి యననొప్పెడు క్షత్రియ కాంతామణి నీ కూరక లభించునని తలచితివా? క్షత్రియ కులాంగన ధైర్యసాహస ముల నన్యపురుషులకు లొంగదనుట నెఱుంగవా. నన్నుఁ

జెనకితివేని నీ ప్రాణము లిచ్చుటనే గొందును ఇంత వఱకు నిన్నొక మనుష్యునిగ భావించి హితబోధఁ జేసితిని. నీతి పరుఁడవై మెలంగితివా సరి, లేకున్న దాని ఫల మనుభ వింతువు. బాగుగ యోజించుకొని కార్యమునకుఁ గడంగుము.

శ్రీరం:—నీనితో నిన్నిమాట లేటికమ్మా. (మహమ్మదీ కులితో) ఓరీ! రారమ్ము. (అని పోఁబోవ)

వేంగ:—(నివారించును.)

మ. కు:—(తనలో) ఔరా! ఈమె నాకు నీతి గఱపెడిని. ఈ పలుకులన్నియు సత్యములే. ఇపుడు తొందరపడినఁ బ్రమా దము కలుగును. ఈమె నెట్లులైన మా కోట గండికోటకు బిలుచుకొని పోవలయు. ఈ త్రోవఁ ద్రొక్కి చూచెద. (ప్రకాశముగా) అమ్మా! నిన్ను జెఱఁబట్టి చెఱుపఁ దలఁప లేదు. ఇచట మీ రొంటరిగ నుండరాదు. మిమ్ముల సు రక్షితముగ గండికోటకుఁ గొనిపోయి, మీ భర్త మొన్న మా తురుష్క యువతి నవమాన పఱచినందులకు వారికి మీ చేత నీతిఁ జెప్పింప వలెనను తలంపు నాకు మొందుగఁ గలదు. మీకు గాని మీ తనయులకు గాని యే హానియుఁ జేయకుండఁ గొని పోవుదుము. నా మాట నమ్ముఁడు.

శ్రీరం:—అమ్మా! నన్ను విడువవే.

ఆడిల్:—(తనలో) ఔరా! ఈ బాలుని ధైర్యము.

పునః ప్రవేశము:—వీరవేంకటపతిరాజు చూఱకత్తితోఁ బరుగిడుచు వచ్చి నూతనపురుషులఁ జూచి.

వీ. వే:—అమ్మా! వీరలెవరు?

వేంగ:—మనల బాధింప వచ్చిన పగతులు.

వి. వెం:—మనలఁ బట్టెదరా. (అని క త్తితోఁ బొడవఁ బోవును)

సేనా:—(చేతిని బట్టికొని కత్తిని లాగి దూరమునఁ బడవైచును)

శ్రీరం:—(ఆ క త్తిని దీసికొని) రమ్ము. (అని పోవును.)

వేంగ:—(పుత్రులను బట్టికొని) నాయనలారా! వారేమియు నసరు లెందు. తొందరపడరాదు.

మ. కు:—(ఆడిల్ షాతో) చూచితిరా క్షత్రియ పరాక్రమము. (వేంగళాంబతో) అమ్మా! మీరు ప్రయాణమై సిద్ధముగ నుండుఁడు. మీ పల్లకిని మోయుటకు మా భటులను బంపెదము. మీరేమియు భయపడవలదు. సురక్షితముగ మీ నాథుని దర్శనముఁ జేయింతుము.

వేంగ:—సరి. మీరిచటినుండి వెళ్ళుఁడు.

మ. కు:—మంచిది. (అని తనవారితో నిష్క్రమించును.)

(అందరు నిష్క్రమింతురు.)



# గండికోటపతనము.

## పంచమాంకము.

( ప్రథమరంగము. )

—)*(—

ప్రవేశము:—మీరుజుమ్ల్మాలా, గులాబ్ మహల్ గుడారమున నాసీనులై సంభాషించు చుందురు.

మీరు:—కామినీ!

ఉ॥ కామిని యేమనందు మన
క్ష్మాపతి, పంపిన లేఖఁ జూచెనో
నేమగు దీనితో మనకు
నేల రణంబని యూరకుండెనో
యేమియుఁ దోఁచదాయె నిపు
డేను రణంబున జేయఁ జూతునా
యేమని వ్రాయునో యనుచు
నిచ్చట నూరకఁ బ్రొద్దుఁ పుత్తునా.

"ముందున కేగిన నుయ్యి వెనుక కేగిన గొయ్యి" అనునట్లున్నది. క్ష్మాపతుల బుద్ధి కేవలము చంచలమైనది. సమయమునకుఁ దగినటుల మాటాడు చుందురు. వారి ననుసరించి పోకున్నఁ బదభ్రష్టులమో, కారాగార వాసులమో కావలసి యుండును. ఒక్కొకసారి మతిచెడినచో మరణ దండన విధించుటయుఁ గలదు. నేను వ్రాసినటుల జరిగించెనో లేదో. నేను వారు వచ్చువఱకు వేచి యుండవలెనా, లేక యుద్ధమును

ప్రారంభింప వలెనా? సమరమును సాగించిన నేమో సాగింప కున్న నేమో. సఖీ! నా కేమియుఁ దోఁచకున్నది కదా.

గులా:—మీరా కేమి నిశ్చయించుకొని యుంటిరి.

మీరా:—నే నేమి నిశ్చయించుకొని యుండిన నేమి. ప్రభువుల యానతి మీఱరానిది కదా.

గులా:—నవాబుగా రేమి సెలవొసంగి యుండిరి.

మీరా:—ప్రథమమున నన్నేగి గండికోటను ముట్టడింపుమని యు, సోదరి వివాహము జరిగించి వెంటనే తాము బయలు దేరి వత్తుమనియుఁ జెప్పి యుండిరి.

గులా:—తర్వాత.

మీరా:—నేను వారిని పెనుగొండ కేగి తిరుమలరాయలను రాకుండఁ జేయుటయే గాక; ఆయనను బట్టి పిమ్మట నిచ్చటికి రమ్మని వ్రాసి యుంటిని.

గులా:—అటులనే వత్తురేమో. తొందర యేల?

మీరా:—ఇప్పటికే యాలస్య మైనది.

గులా:—అయిన రారేమో.

మీరా:—అటులనే తోఁచెడిని.

గులా:—రాకున్న.

మీరా:—మనము తిరుగ గోలకొండ కేగవలసినదే.

గులా:—యుద్ధము.

మీరా:—యుద్ధమును సాగించుట కనుమతి లేదు. అచ్చటి కేగి మరల యుద్ధమునకుఁ బురికొల్ప వలయు.

గులా:—అయిన గోలకొండ కేగుదము.

మీరా:—సఖీ! నీవో.

గులా:—నే నెందులకు. మీతో నాకుఁ బనిలేదు.

తే॥ గీ॥ "అదను దొరికిన వెంటనే ♦ ముదము గూర్పఁ
దలఁచి తిరుమలరాయని ♦ తలను దూసి
తెచ్చి నీపదంబులఁ జేర్తు ♦ తెలివ" యనుచు
నన్న మాటల మరచితే ♦ వనజనయన.

ఇది చాలదా. [ అని పోఁబోవ ]

మీరు:—( అడ్డగించి ) మానినీవతంసమా! అందులకేగదా మరలఁ బోయి యుద్ధమునకుఁ బురికొల్పెదనని నుడివితిని. ఎల్లనైన యుద్ధము జరుగునట్లుగఁ జేసి నీ కోర్కెఁ దీర్ప వలయుననియే గదా నే నిన్నిప్రయత్నములఁ జేసితిని. తొందర పడకుము. ఊరడిల్లుము. ధైర్యము వహించుము.

గులా:—అన్న మాటను దప్పుటయు నుచితము కదా.

మీరు:—నేను మాటను దప్పు వాఁడను కాను సుమా. చంద్రికళా! నేను స్వతంత్రించి యుద్ధమును నడుపుటకు స్వతంత్రుఁడను కాదని నీకుఁ దెలియునుగదా. నేనొకరిని సేవించు చున్నాను. సేవకుఁడనుగ నుండినన్ని దినము లొకరికి లొంగియుండి వారు చేయుమనియెడి కార్యములను మాత్రము చేసి పిమ్మట నూరకుండ వలసి యున్నది సుమా. అన్న మాటను దప్పితి ననుచున్నావు. నే నెన్నటికిని దప్పి యుండలేను. సమయము తటస్థించినపుడు తిరుమలరాయుని తలను దూసి నీ కర్పింతు నంటిని. అంత వఱకు నీవు నిదానింపక తప్పదు. ఉండక పోయిన తప్పు నీయదియె కాని నాది కాదు.

గు:లా:—(ఆశ్చర్యముతో ముక్కుపై వ్రేలిడుకొని) ఔరా! మోసగాఁడా! నీ వెంతటికైనఁ దగుదువు. ఇంతటి వ్యాఖ్యానము సేయుదువని నేనెంచియుండ లేదు. నీ గూఢార్థమును నేను గ్రహించి యుండిన బాగుండెడిది. మగవారిని నమ్మరాదనుట నీవు సార్థకము చేసితివి. ఇంత చేసియు బైపెచ్చు నా యందే తప్పు నిరూపించితివి కదా.

విూసు:—కురంగాక్షీ!

తే. గీ॥ పురుషులను నమ్మరాదని ♦ పొలతు లంద్రు
పొలతులను నమ్మరాదని ♦ పురుషు లంద్రు
అట్టి మాటలతో మన ♦ కగునె యిపుడు
వేఱె తలపక రమ్ము నా ♦ వెంట నీవు.

స్త్రీ రూపమున నున్న బింబమును గూడ నమ్మరాదని కొందఱందురు. ఆ మాటలతోఁ బని లేదు. నేను నీపై దోషారోపణము చేయునంతటి వాఁడనా. మనోహారిణీ!

సీ॥ పారశీకమునుండి ♦ పఱతెంచి నేర్పున
షాజహాన్ దరి వేగ ♦ చేరె నెవఁడు
భూపతి పుత్రుండు ♦ బోర సహింపక
గోలకొండ నవాబు ♦ గూడె నెవఁడు
సాహస కృత్యముల్ ♦ సాగించి నావాబు
సేనాని బిరుదుతో ♦ జెలఁగె నెవఁడు
యజమాని తనుజూచి ♦ యదరునట్లొనరించి
యాటలాడించెడి ♦ యధికుఁ డెవఁడు

తే. గీ॥ మతవిరోధులఁ గూలియింపఁ ♦ బంత మూని
భండనము జేయ సిద్ధుఁడు ♦ యుండె నెవఁడు
అట్టి యీ మీరుజుమ్లా ♦ యతిన వినుము
దాసుఁడుగమాఱె నీకడ ♦ దయను జూడు.

నా ధైర్య సాహసములన్నియు నీకడఁ బటాపంచలై పోయెను గదా.

గులా:—ఔను. మాటలు చాలుకేగాని వేలులేగు [అణ్ణోక]

[ప్రవేశము:—సేవకుఁడు.

సేవ:—మహారాజ్! నవాబుగారు పెనుగొండనుండి విచ్చేసి గుడారమున మకాము చేసి యున్నారు. సంగతి తమ కెఱింగింపు మనిరి.

మీరు:—అబ్బా! (నిట్టూర్పు విడిచి) సరి. నీవు నెళ్లి నా దర్శనమునకు వచ్చుచున్నానని మనవి చేయుము.

సేవ:—చిత్తము. (నిష్క్రమించును.)

మీరు:—శశిరేఖా! ఇఁక భీతిల్లకుము. నీ కోరిక నెఱవేరును లెమ్ము.

గులా:—(సంతోషముతో) సరి. మనము నవాబుగారిని గలిసి కొనఁ బోదము.

మీరు:—నీవు రాఁదలంచితివా?

గులా:—ఔను. నేను వెలుపలనుండి మీ మాటల విను చుందును. నవాబుగారి యెదుటికి రాను.

మీరు:—మంచిది పోదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

# ద్వితీయ రంగము.

ప్రవేశము:—మహమ్మద్ కులీకుతుబ్ శాహా హుక్కాఁ బీల్చుచుండిన గుడారమున (శిబిరము) ఆడిల్‌షా తోడను, మంత్రితోడను మాటాడుచుండును.

మ. కు:— వజీర్! మీరుజుమ్లాను మనరాక నెరిగించితివా?

మంత్రి:—సేవకునిచేఁ జెప్పి పంపితిని.

మ. కు:—సేనాని ప్రాసికతుల మనము తిరుమలరాయని బట్టి తేఁజాలక పోతిమి. మన మేగునప్పటికి; అతఁడు పెనుగొండను విడచి చాలసేపై యుండలేదట. దురాత్ముఁడు తప్పించుకొని యెటకేగెనో.

ఆడిల్:—గండికోటఁ జేరి యుండును. సంశయింపనేల?

మ. కుతుబ్ శాహా:—గండికోటకే వచ్చియుండిన యుద్ధమునకు రాకుండునా.

మంత్రి:—వత్తురు. వారూరక కోటను స్వాధీన పరతురను కొంటిరా.

ఆడిల్:—వారు చేయక పోయిన మనము చేసికొనఁ జాలమా.

ప్రవేశము:—సేవకుఁడు.

సేవ:—సర్కార్! సేనాని మీరుజుమ్లా గారు తమ దర్శనార్థ మేతెంచి యున్నారు. తమ యాజ్ఞకు వేచి యున్నారు.

మ. కు:—మంచిది. రమ్మనుము.

ప్రవేశము:—మీరుజుమ్లా.

మీరు:—(సలాము చేయును.)

మ. కు:— సేనానీ! కూర్చుండుము.

మీరు:—(కూర్చుండి) పెనుగొండనుండి యెప్పుడు వచ్చితిరి.

మ. కు:— చాలసేపు కాలేదు. వచ్చి నీకు సందేశ మంపితిమి. ఇక్కడి పరిస్థితు లెట్లున్నవి?

మీరు:— ఏమని చెప్పఁ గలను. కోటను ముట్టడించి యున్నాము. దుర్గమునందలి సంగతులు బొత్తిగఁ దెలియుట లేదు. పెనుగొండనుండి తిరుమలరాయలు సైన్యముతోఁ గూడ వచ్చి కోటఁ జేరి యున్నాఁడని యింతకు మున్నె తెలిసినది. ఆ సంగతి మాకుఁ దెలియకయే జరుగుటఁ జూడ వారి కేదియో రహస్య మార్గ ముండినటు లున్నది. గండికోట వారు సామాన్యులు కాదు. వీరిని విడువరాదు.

మ. కు:— ఏల వదలుదుము,

మీరు:— నేఁడు యుద్ధపతాకము నెత్తి యున్నారు. నాకుఁ జూడఁ గదనమునకు సంసిద్ధులైనటులఁ దోఁచినది.

మంత్రి:— యుద్ధమునకు సంసిద్ధులు కాక, మీ రాకకు వేచి కోట నొసంగుదురా. ఎదుటి బలమును తెలియఁ జాలకఁ బోరఁ దొడంగుటకు నే సమ్మతింపను. తర్వాత ప్రభువుల చిత్తము.

మ. కు:— ఔను. నీ మాటయు బాగుగ యోజింపఁ దగినదే.

మీరు:—(తనలో) మంత్రి పలుకుల విని బవరమునకు స్వస్తిఁ జెప్పుదు రేమో. యుద్ధమును మానిన నా కోర్కె నెఱవేఱదు. ఎటులనైన యుద్ధమును సాగించుట కుపాయముఁ జేయ వలయును.

మంత్రి:—సేనానీ! నీకుఁ బగతుల బలంబులను గుఱించి బాగు గఁ దెలియునా?

మీరు:—నా కంతగఁ దెలియదు. ఏల?

మంత్రి.—తెలియకయె పోర నూహించితివా? (నవాబును జూచి) మహీపతి! గండికోట సామాన్యమైనది కాదు.

సీ॥ సింహశార్దూలాది ♦ చెనటి మృగాళితో
నిండిన నల్లని ♦ కొండ లకును
ఎలుకల చెంచుల ♦ సేనాది మూఁకతో
నెసఁగు పొదలఁ గల్గు ♦ నెట్టి మలకు
పోతరించినయట్టి ♦ బోయల తోడను
నలరారు చుండెడి ♦ యడవు లకును
త్రోవలఁ గొట్టెడి ♦ దొమ్మర గుంపుతో
విట్టిపీగుచు నుండు ♦ విపిన ములకుఁ

తే॥ గీ॥ గలను నడుమను ఘనమగు ♦ గండికోట
వెలయు చున్నది రేనాఁటి ♦ వీరులకును
పుట్టినిల్లయి, దానితోఁ ♦ బోరు టకును
మనకు శక్యముగాదు నా ♦ మాట వినుఁడు.

హిందూ మహావీరుల యవక్ర పరాక్రమముల మనము విని యుండలేదా. మనమిచ్చటనె యుండినఁ బట్టపగలు వచ్చి కుత్తుకలఁ గోయక మానరు.

మీరు:—(తనలో) ఏమది. ఇతఁడు నవాబుకు భీతిగొలుపు మాటలఁ జెప్పి నా ప్రయత్నమును విఫలముఁ జేయునటు లున్నాఁడు. కానిమ్ము. (ప్రకాశముగా) మంత్రివరా!

ఆ. వె॥ పట్టపగలె వచ్చి ♦ పడవేసి కుత్తుకల్
గోయఁ గలరటంచుఁ ♦ గూరుచున్న
జయము గలుగఁబోదు ♦ జయలక్ష్మి రాఁబోదు
పట్టి తీరువాఁడ ♦ వదల కని.

మీరు హిందువుల పరాక్రమమును గోరంతయుండినఁ గొండంతలుగఁ జేసి మాటలాడెదరు గాని మహమ్మదీయ సైనికు లంత మానహీనులని భావించితిరా. విజయనగర సామ్రాజ్యమును రూపుమాపినది పారశీకులు కారా. మహమ్మదీయ ప్రభువులును, మిత్రులును నైన కూలికుతుబ్ షాహా ఆలీ ఏడిల్ షాలను బట్టి యాడించిన రామభూపాలుని తాళికోటకు బలియొనరించినది తురుష్క యోధాగ్రేసరులు కారా! మీరు పవిత్ర మహమ్మదీయ మతస్థులెయ్యు; నన్ను నా సైనికులను బరాక్రమ రహితులుగఁ జేసి యవమాన పరిచెదరా. హిందువు లెటుల గెలుతురో చూచెద.

చ॥ పలుమరు గండికోటరిపు
బాహుబలంబును జెప్పనేల? యా
తులువల పేరు నే వినని
తొందరఁ జెందకు నేను గల్గనే
బలిగొనివత్తు వారలను
బాకున జిమ్ముచు సంగరంబునన్
దెలియరె నా పరాక్రమముఁ
దెల్పెదఁ జూడుడి నన్నుఁ బంపినన్.

నా పరాక్రమ విక్రమంబులఁ జాటుట కిపుడుగదా అదను దొరికెను. గండికోటను బట్టియే తీరవలెను. నా

సాహసములఁ బఱికించెదరు గాక.

మ. కు:—సెబాస్! సేనానీ! నిన్ను మెచ్చితి. నీవు గండికోటను జయించిన దానికి నిన్ను నవాబుగా నొనరించి పోయెద. నా మాట నమ్ముము.

మంత్రి:—సేనానీ! ని పట్టుదల యెంతటిదో పరీక్షింపఁ గోరి యటులంటిని. నేను మహమ్మదీయ మతస్థుఁడను కానా? తురుష్క రక్తము నా రక్తనాళములఁ బ్రవహించుట లేదా? కానిమ్ము. ధైర్యముతోఁ బోరు సాగింపుము. ఈ కోటను సాధించినఁ గదా నిన్ను మెచ్చవలెను.

మీరు:—గండికోటను సాధించుట గొప్ప పనికాదు. (యోజించి) మఱచితిని. మీరు పెనుగొండను స్వాధీనము చేసికొంటిరా లేదా?

మ. కు:—లేదు. తిరుమలరాజు లేఁడని తెలిసినందునఁ ద్వరితముగ నిట కేతెంచితిమి. అతని కుటుంబమును బట్టితెచ్చి యున్నాము.

మీరు:—వారెక్కడ.

మ. కు:—పిలిపింతును. సేవకా!

సేవ:—(ప్రవేశించి) ఆజ్ఞ.

మ. కు:—నీ వేగి పెనుగొండ రాజకుటుంబమును దోడ్కొని రమ్ము.

సేవ:—చిత్తము. (అని లోపలికేగి మరల వచ్చి) సర్కార్! గండికోటనుండి రాయబారి వచ్చి యున్నాఁడు. పంపుదునా?

మ. కు:—పంపుము.

ప్రవేశము:—కుమారదాసు.

కుమా:—(సలా మొనరించును.)

మ. కు:—అయ్యా! కూర్చుండుము. నీ పేరేమి?

కుమా:—(కూర్చుండి) నన్ను కుమారదాసని పిలుతురు.

మ. కు:—మాతో మీ కేమి పనియున్నది.

కుమా:—పనియుండి, నా ధర్మము నెఱవేర్ప బోవలెనని వచ్చితిని కాని మా కాలమును వృథాగాఁ గడుపుటకు రాలేదు.

మ. కు:—నీ వెందులకు విచ్చేసితివి.

కుమా:—అయ్యా! మా తిమ్మానాయఁడు

సీ॥ బాబయ్య యురుసుకు ♦ బలమొసంచి మీవారు
చెడ్డ కార్యంబులఁ ♦ జేసి రంట
భిక్షుగాండ్రటనుండ ♦ బెదరించి పైఁబడి
కోపించి వారలఁ ♦ గొట్టి రంట
మానిని మా కథల్ ♦ పాడించి నవ్వుచు
మూర్ఖముతోఁ దిట్టఁ ♦ బూనె నంట
తులువలు కలుద్రావి ♦ తోయజాక్షులమీఁద
రాలను రువ్వగా ♦ జాలి రంట

తే॥ చెనటులటుచేయఁ దగినట్లు ♦ చేయునెంచి
వారినటుచేసె మా రాజు ♦ వారిమాట
యే నిజంబని పోరుకు ♦ బూన తగదు
తగవు మనకేల వెనుకకుఁ ♦ దరలు మనియె.

దుష్ట శిక్షణయు శిష్ట పాలనయు భూపతుల ధర్మము. దుష్టులను దండించినందులకు మీరు మా రాజుపైఁ గినిసి

యుద్ధమునకు వచ్చుట ప్రజాపాలకులగు మీకు మంచిది కాద నెను. దుష్టులను మీరు మాత్రము దండింపరా? దుర్మార్గులు హింసకులైనను, మహాత్మ్మదీయులైనను దండనార్హులు. దుష్ట హింసకులను మీరు దండించిన మే మూరకుండమా. కనుక మీకీ స్వల్పవిషయమై యుద్ధము జేయఁబూనుట కంటెఁ జెలి మిగాట యిరువురికి శ్రేయస్కరమనియె. మీరలీ సంధికి సమ్మ తింతురని నా యాశయము.

మ. కు:—(యోజించుచు మాటాడకుండును.)

మీా కు:—(తనలో) సంధికి సమ్మతింతురేమో. ఎటులనైన దీనికి విఘాత మొనరించెదఁ గాక.

కుమా:—అయ్యా! మాటాడరేల? మీా కసమ్మతిగనున్న వదలివేయుఁడు. నా మాట వినుఁడు. యుద్ధమనేక పాప భూయిష్టములగు కార్యములకు హేతువగును. సమరమును సాగించితిమేని

చ॥ తొలుత ధనంబుపోవు బహు
దోషము చేకురుఁ గీడుమూడు నే
ఫలము లభింపఁ బోదు కడు
పాపము హెచ్చు జనంబులెల్ల, నా
లలనల జార చోరతతి
డాంబిక వృత్తిఁ బరాభవింపఁగా
మలమల మాడ్చు కాటకపు
మంటలు చేకురుఁ బోరు సల్పినన్.

ఇన్ని పాపకార్యములకు మీా రుత్తరవాదులు కావలసి వచ్చును. బాగుగ యోజింపుఁడు.

మ. కు:—ఈ విషయమై మేమేమియుఁ జెప్పఁ దలచుకొనలేదు. (వీరారుజమ్మలాను చూచి) సేనాని నీ యిష్టము వచ్చినటుల జరిగింపుము.

వీరా:—(స్వగతము) నా నోముపండెను. (ప్రకాశముగా) అయ్యా! మేమింతటి వ్యయ ప్రయాసముల కోర్చి వచ్చినది మీ సంధికి సమ్మతించి వృథా పోవుటకా. ఈ యోజన మమ్ము పరాభవించునపు డెక్కడికేగి యుండెను. మహాత్మ్యదీయులన్న వీరాకుఁ దృణప్రాయమా? మ్లేచ్ఛులు మిమ్మేమి చేయఁగలరు. (అర్థోక్తి)

కుమా:—అయ్యా: అన్ని మాటలతోఁ బనిలేదు. గతించిన వానిని త్రవ్వుకొనుట సరికాదు. నే నేతెంచిన కార్యమునకు జవాబొసంగుఁడు. ఉపన్యసింప నక్కర లేదు. స్వల్ప కారణమునకై కలహమును బెంచి వృథాగా రెండు రాజ్యముల నశింపఁ జేయకుఁడు.

వీరా:—నశించునది మా రాజ్యముకాదు. మీ రాజ్యము. మీ గండికోట. మీరు సంధికోరిన మా షరత్తులివి.

సీ॥ పాదచారిగవచ్చి ♦ పాదుషా పదములఁ
బట్టి మన్ననఁ గోర ♦ వలయు నను
మా వ్యయంబుల నిచ్చి ♦ మాకు సామంతులై
కప్పము నియ్యక ♦ తప్పదనుము
కాలఁ జూపెడి పనుల్ ♦ కాదని చెప్పక
తలతోడఁ జేయఁగా ♦ వలయు నను
తిరుమలరాయలు ♦ పరిభవించిన యట్టి
యువిద మన్ననఁగోర ♦ నొప్పు సనుము

తే॥ గీ॥ పట్టవలె మా మతంబని ♦ పలికి రనుము
సమ్మతించిన మీతోడ ♦ సంధి జరుగు
సమ్మతింపక యీ సంధి ♦ జరగ దనుము
గండికోటను బట్టక ♦ కదల రనుము.

కుమా:—(కోపముతో తల యూచి) మీ నియమములను సమ్మతించుటకుఁ గాని వినుటకుఁ గాని మా వారు నన్నుఁ బంపియుండ లేదు న్యాయమును మాటాడి మా గౌరవమును నిలుపుకొందుము. మీరు చెప్పినట్లు చేయుటకు మే మబలలము కాము. చేతులను గాజులను దొడిగికొని యుండ లేదు. సరి యుద్ధమునే జేతము లెండు (అర్థోక్తి)

ప్రవేశము:—సేవకుఁడు.

సేవ—స్వామీ! తిరుమలరాయల కుటుంబమును దోడ్కొని వచ్చితిని.

మ. కు:—సరి. రానిమ్ము.

కుమా:—(తత్తర పాటుతోఁ జూడఁ దొడంగును.)

ప్రవేశము:—వేంగళాంబ ముసుఁగు ధరించి పుత్రులతోఁ గూడ వచ్చేయును.

వేంగ:—(తలవంచికొని నిలచి యుండును.)

చి. వేం:—ఆ. వె. అమ్మ తోడ మేము ♦ నాటలాడుచునుండ
పంపనేల భటుని ♦ మమ్ముఁ బిలువ

శ్రీరం:— కార్యమేమికలదు ♦ కాదు మాకిట నుండ
పనులు లేక కబురుఁ ♦ బంప నేల?

మీరు:—ఈమె యేనా తిరుమలరాజు భార్య. హిందూయువతికి ముసుఁగేల? (అని తీయుటకు పోఁబోవ)

మ. కు.
ఆడిల్.
మంత్రి.
} (తొందరపడి) ఆ - ఆ - ఆ - (అందురు.)

కుమా:—(కోపమున) కత్తిని దూసి పైఁబడ నుంకించును.

శ్రీరం.
వీ. వే.
} (తమ మొలలో దాచి యుంచు చిన్న కత్తులతో మీరుజుమ్లాను పొడవఁబోగా ఆడిల్‌షా, మంత్రి వారిని నిలుపుదురు.

గులాబ్:—ఆ-ఆ- జాగ్రత. (అని వచ్చి నిలుచును.)

వేంగ:—(ఒడిలో దాఁచిన బిచువాను పైకెత్తి) మ్లేచ్ఛాధమా!

మీరు:—(ఎత్తిన కరమును దించి నిలిచియుండును)

వేంగ:—మ॥ పలువా! క్రూర! మదాంధ! నీపొగరుచే
బాధింప నేతెంతువా?
తులువా! భీతి యొకింత లేక మదిలో
దుర్మార్గపుఁ గూతలఁ
బలుకఁ జాలిన యంతమాత్రమున నీ
పంతంబు లేదేరికే
బలినేఁ జేసెదఁ బట్టి నిన్నిపుడె నా
పాదంబునఁ ద్రొక్కుచుఁ.

నీచా! నీ క్రూరవక్షంబును జీల్చివేసెదను జూడుము. అడుగిడిన నీ ప్రాణములు నీవి కాఁజాలవు. జాగ్రత్త.

మీరు:—(స్తంభీభూతుఁడై నిలచి పోవును.)

కుమా:—[స్వగతము] ఇఁక నే నిటఁ దడవొనరింపరాదు. మా రాజుగారికి సంగతిఁ దెలిపి యీ తల్లిని విడిపింప వలయును. (అని నిష్క్రమించును.)

గులాబ్:—అయ్యా! మీ కింకను దెలివి రానందులకుఁ జింతించు చున్నాను. అబలల నగడుపఱచు నాచారము మీరింకను మానకున్నారే. మహమ్మదీయ ప్రభువులే మహమ్మదీయ మానినుల మానముఁ దీయించుటకు మూలాధారమై నిలిచిరి మీరు నేర్పిన పాఠమేకదా హిందువులకు. లేకున్న బూర్వమెప్పుడైన హిందూనృపాలురు పరభామలఁ బరాభవించి యుండిరా? మీరు మొదలిడి యిప్పటి హిందూభూకాంతులకు దారిఁ జూపి వారిచే నా బోటి ముసల్మాను కన్యకల మానము దీయించు చున్నారు. తురకలు హిందూ యువతులఁ బట్టుచున్నందునఁగదా వారు తురుష్కుల భార్యలను భంగపఱుప నెంచుట. మీ రూరకుండిన వారట్టి నీచ కార్యములఁ జేయుట కెన్నటికిని బూనుకొనరు. మీ రేచేతఁ జేసిన వా రేచేతఁ జేయుదురను తలంపు మీ కెందులకు లేదు. ఇప్పటికైనను బారశీక భామినుల యందనుగ్రహముంచి, వారి శీలమును గాపాడఁ గోరితి రేని పరభామలఁ బరాభవించుట మానుఁడు. స్త్రీలన్న మీ కింత నిరసన భావమేల? కలకంఠకంటి కన్నీరొలికిన సిరియింట నుండనొల్లదను సంగతి మరచితిరా? భామినులు లేకున్న నీ ప్రపంచమంతయు నిష్ఫలముగదా. వారు లేకుండ మీ రేకార్యమును నిర్వహింపఁ గలరు. ముసుఁగు దీసి ముందటికి వచ్చిన ముల్లోకముల జయింపఁగల సాహసము మాకున్నయది కాని పురుషులకున్నదా. జేనెడు మీసములఁ బెంచికొని విఱ్ఱవీగినంతటనె మీరు గొప్పవారైతిరా. ఇఁక మీఁదటనైన మీరలీ యాచారమును

వదలుడు. (వేంగళాంబను జూపి) ఈ పూతచరితను దాకిన బుగ్గమై పోరా. ఈమెను చెఱఁబట్టి బ్రతుకఁ గలరా. మీ రాజ్యములు నిలుచునా. తల్లీ! నేను నిన్ను మరచి యుండ లేను. అలనాఁడు నీవతినుండి నన్ను గాచి రక్షించితివి. నేను నీ మానముగాచెద నంటిని. ఇపుడు మా నవాబుగారి యనుమతిఁ బొంది మిమ్ముల మీ పతికొప్పఁ జేసెదను. భయపడ వలదు. [నవాబును జూచి] మహారాజ్! ఈమెను నా వెంటఁ బంపఁ బ్రార్థించెద. నే నిచ్చిన సెలవులకు మన్నింప వేఁడెద.

మ. కు:—మంచిది.

గులా:—అమ్మా! మిమ్ము గండికోటఁ జేర్చి వత్తును రండు.

(అని పిలుచుకొని పోవును.)

(అందఱు నిష్క్రమింతురు.)

# తృతీయరంగము.

ప్రవేశము:—గండికోటలోఁ దిమ్మలరాయులు తిమ్మానాయుఁడు కలిసి యోజించుచుందురు.

తిరుమ:—నాయుఁడూ!

ఉ॥ ఏమని చెప్పువాఁడ నిపు
డేమియుఁ దోఁచదు మాటలాడఁగా
రాముని రాజ్యమంచు మన
రాష్ట్రము నందఱి వారలెంచగాఁ

ప్రేముడి జేలి శాత్రవుల
   పేసులడంచియు మూర్తిమంతులై
తామొకనైన నిర్వికమె
   ధాత్రిని బాసిరి కీర్తిశేషులై.

మా సంతతి యిట్టి హీనస్థితికి వచ్చునని స్వప్నమునం దైనం దలంచి యుంటిమా. మా నాశమును మహాతరువునకీ పచ్చపురుకలు పెడపురుగులై జనించిరి కదా. (యోజించి) తిమ్మానాయుండా! మనవిరా కొలంది సైన్యముతోం బోరిన గోలకొండ వారిని జయింపం జాలమా.

తిమ్మా:—నేను గూడ దానినె యోజించు చున్నాను. మీరు నొరిపాటు చేసిరి. మా కెక్కువ సైన్యమును జేర్చుటకు ముందె మీరు మహామ్మదీయుల నవమానపఱచి కయ్య మునకు దెచ్చుకొంటిరి. ఇపుడు యోజించుట వలనం బ్రయో జన మేమి?

తిరుమ:—నాయుండా! అవును. ఆ నాండు తురకలు చేసిన కృత్యములను జూచి నేం దాళలేక పోయితిని. వారొనరించి నది మాత్రము బాగున్నదా?

తిమ్మా:—బాగున్నదని యెవరందురు. ఆ హీనజాతివారు న్యాయా న్యాయముల విచారించి కార్యముల జేయుదురా?

తిరుమ:—అయిన దానికి యోజింపం బనిలేదు. మనమూర కుండనేల?

తిమ్మా:—ఆ॥ వె॥ మన కుమారదాసు ♦ మాటాడ నేగెను
   తురకలచటం జేరి ♦ దుడుకుం జూపి

బాధపెట్టఁగలరా ♦ బంధితురో లేక
సంధిజరుగఁగలదా ♦ సమర మగునో.

ఇఁక గొంతిసేపటికైనను రాక మానఁడు. అక్కడి సంగతులను దెలిసికొని పిమ్మట మనము చేయవలసిన పనులను జేయుదము. ముందుగనె తొందర పడనేల?

తిరుమ:—గోలకొండవారు సంధికి సమ్మతింతురను నమ్మకము నాకు బొత్తిగ లేదు.

తిమ్మా:—సమ్మతింపక పోయిననో సమరమును సాగింతము. వారికి భయపడి పరుగిడుదుమా. యుద్ధమున మృతిఁజెంద వచ్చును గాని యీ నీచులకు లొంగుదుమా.

తిరు:—(ప్రక్కన జూచి) మన కుమారదాసు వచ్చెను తిమ్మన్న.

ప్రవేశము:—కుమారదాసు.

తిమ్మా:—(తొందరతో) కుమారదాస్! కాయాపండా?

కుమా:—కాయ గాక పండెటులగును. (స్వగతము) రాణీగారి సంగతిఁ జెప్పుదునా? కూడదు. ఇపుడు చెప్పిన దిగులు పడుదురు. చెప్పరాదు.

తిమ్మా:—ఏమి యోజించు చున్నావు.

కుమా:—వారు తురుష్కులు కారా. సంధికి సమ్మతింతురా?

తిరుమ:—మహమ్మద్ కులీ యేమనెను?

కుమా:—అతఁడూరకుండెను. దానిని జూచి సంధి జరుగునని యనుకొంటిని (అర్థోక్తి)

తిరుమ:—కడకేమాయెను.

కుమా:—సేనాని మీరుజుమ్మలా యడ్డుపడెను. నవాబతనితో నేకీభవించెను.

తిమ్మా:—అయిన వారి యభిప్రాయముఁ దెలిసికొన లేదా?

కుమా:—వారు చెప్పినగుల మనమొప్పుకొనిన సంధికి సమ్మతింతు మనిరి.

తిమ్మా:—వారేమి కోరిరి.

కుమా:—సీ॥ పాదచారిగవచ్చి ♦ పాదుపాపదములఁ
బట్టి మన్ననఁగోర ♦ వలయు నంట
వ్యయములఁ మీా రిచ్చి ♦ వారి సామంతులై
కప్పము నొసఁగక ♦ తప్ప దంట
కాలఁ జూపెడి పనుల్ ♦ కాదని చెప్పక
తలలొడఁ జేయఁగ ♦ వలయు నంట
బాబయ్య యురుసులోఁ ♦ బరిభవించిన యట్టి
యువిద మన్ననఁగోర ♦ నొప్పు నంట
తే: గీ॥ వారి మతమును బట్టఁగ ♦ వలయు నంట
సమ్మతించిన వారితో ♦ సంధి జరుగు
సమ్మతింపక పోయిన ♦ జరుగ దంట
గండికోటను బట్టక ♦ కదల రంట.

తిరుమ:—(కోపమున) ఔరా! తిరుమలరాయలన్న వారికంత పలుచనయయ్యెనా. నాయుఁడా! ఇంక నాలస్యమేల? సేనాధిపతికి సైన్యమును సిద్ధముచేసి యుండుమని కబురు చేయుము. ఆ దురాత్ములను బినాకినీ తీరమునఁ బడవైచి గడ్డములఁ బట్టి కటకటఁ గుత్తుకలఁ గత్తిరించినఁ గదా తిరుమలరాయల శక్తి సామర్థ్యములఁ దెలిసికొనఁ గలుగుదురు. ఇదియే మనము కడసారి చేయు యుద్ధము సుమా. మన మీా ప్రపంచము మీాఁది భ్రాంతిని ప్రాణాలపై నాస

మాని పోరొనరింప వలయు.

తే॥ గీ॥ చక్రవర్తులనేకులు ♦ చనఁగ లేదె?
వెంటఁ గొంపోయిరే వారు ♦ నేలకొలఁది
ధనము, వెంటనాటప్రధన ♦ ధాన్యములును
మనల, పాపపుణ్యంబులే ♦ మనకుఁ దోడు.

కుమా:—దేవా! మీతో మాటొకటి చెప్ప మరచితిని. రాణీగారిని పుత్రులతోఁగూడఁ దురకలు పట్టి యున్నారు. వారిని విడిపింప వలసియున్నది. ఇది మొదలుతఁ జేయవలసిన పని.

తిరు:—(తత్తరపాటుతో) ఆ.ఆ. ఎక్కడ (అక్కడ)

కుమా:—(ప్రక్కకు జూచి) ఔరా! వారే వచ్చుచున్నారు.

ప్రవేశము:—వేంగళాంబ పుత్రులతో వచ్చును.

శ్రీరంగ:- } (పరుగిడుచుఁ బోయి తండ్రినిఁ బట్టుకొని) నాయనా
వీ. వేం:- } నా మాకుఁ జెప్పక వచ్చితి వేల?

తిరుమ:—(ఇరువురిని ముద్దిడుకొని తలపై దువ్వెను.)

వేంగ:—(దుఃఖముతో) నాధా! మనగతి యన్యాయము పోయెనే. మనకికఁ దిక్కెవ్వరు.

తిరుమ:—కాంతామణీ! యేల భయపడియెదవు. మేమిపుడేగి తురకల బలిగొని వత్తుము.

వేంగ:—ప్రాణకాంతా! మనకు జయము కలుగుట గగన కుసుమము లభించుట వంటిది. అబ్బో! నేల యీనినట్లు తురకల సైన్యము నిండియున్నది. చీమలు బారులు తీరినటులఁ దీరి యుద్ధమునకు సంసిద్ధులై యున్నారు. ఇనుక

చల్లిన నేల రాలను సుమా. అట్టివారిని మనము జయింపఁ గలమా.

**తిరుమ:**—సఖీ! జయాపజయంబు లొకరి స్వాధీనములు కావు. పోనిమ్ము. నిన్నెవరు పిలుచుకొని వచ్చిరి.

**వేంగ**—వీరా రానాఁడు పరాభవించిన మహమ్మదీయ వనిత నన్నుఁ దోడ్కొని వచ్చి విడిచి పోయెను.

**తిరుమ:**—ఆమె యెచ్చట నున్నది?

**వేంగ:**—ముసల వారి మకాముకు వెళ్లెను.

**తిరుమ:**—(ఆశ్చర్యముతో) ఔరా! ఆ రక్కసి మూఁడవ యోయుంగ చేసినది. ఔరా దాని సాహసము.

**వేంగ:**—ప్రియా! ఆమెను మారకుఁడు. మంచిది కాదు.

**తిరుమ:**—ఇఁక దిట్టిననేమి తిట్టకున్న నేమి. చేయవలసినంత చేసినది. (తిమ్మానాయునితో) మీరు వెళ్లి యుద్ధమునకుఁ బ్రయాణము కండు. నే నిదే వచ్చితిని.

**తిమ్మ:**—చిత్తము. (అని కుమారదాస్‌తోఁ గూడి నిష్క్రమించుదు.)

**వేంగ:**—నాథా! యుద్ధమునకుఁ బోయెదరా?

**తిరుమ:**—అవును.

**శ్రీరంగ:**—నాన్నా! నీతోఁగూడ యుద్ధమునకు వచ్చి వారిని చంపి వచ్చెదను.

**వీ. వే:**—నేను మాత్రము రానా.

**తిరుమ:**—సరి. మిమ్ములఁ బిలుచుకొని పోవుటకు మరల వత్తును లెండు.

**వీ. వేం:**—నీవు రావు.

తిరుమ:—తప్పక వత్తును.

వేంగ:—నాథా! మీ రేగుట నాకు సమ్మతిగ లేదు. అయినను నిపుడు వలదన రాదు. నాకు మీ దర్శనము త్వరలోఁ గలుగుఁ గాక.

తిరు:—(వినుట నభినయించి) అదిగో రణభేరి వినఁబడు చున్నది. నేను బోయివత్తును. (నిష్క్రమించును.)

వేంగ:—నాయనలారా! మనమా గుట్టనెక్కి యుద్ధమును జూతము రండు. (అని నిష్క్రమింతురు.)

## చతుర్థరంగము.

ప్రవేశము:—గండికోట యందలి గుట్టపై వేంగళాంబ తన పుత్రద్వయముతోఁ గూడ నాసీనయై యుండును.

పి. వేం:—అమ్మా! మన దండు వారిని సమీపించు చున్నది చూడుము. (లోపల యుద్ధరవములును, తుపాకుల శబ్దములును, పౌరుష వాక్యములును వినఁబడు చుండును.)

శ్రీరం:—ఓరీ. రెండు సైన్యములును గలిసి కొనెను జూడుము. (లోపలనుండి వధింపుఁడు వధింపుఁడనియును, మారో మారో యనియును అఱచు చుందురు.)

వేంగ:—నాయనా! యిరు తెగల వారును ధైర్యముతోఁ బోరు చున్నారు,

పి. వే:—అమ్మా! మనవారు మూఁకనెటుల నఱుకుచున్నారో. చచ్చెను. చచ్చెను.

వేంగ:—ఎవఁడు. ఎవఁడు.

పి. వే:—చూడవే. తురకసైనికుఁడు క్రిందఁ బడి దొర్లు చున్నాఁడు.

శ్రీరం:—అమ్మా! తండ్రిని జూడుము. గుఱ్ఱములను, ఏనుఁగులను తుండెములఁ జేసి రణరంగమున విచ్చలవిడిగ దిరుగు చున్నారు.

పి. వే:—చంపెను. చంపెను. తిమ్మానాయుఁడే సరి. ఎందరిని నఱుకుచున్నాఁడో చూడుము. సెబాస్! ఇంకఁ దురకలగతి యధోగతియే.

శ్రీరం:—అమ్మా! ఎవఁడో తురుష్కుఁడు మన యశ్వసైనికునిఁ బరిమార్చెను. బలే! గుఱ్ఱము తురకలను జెడఁద్రొక్కు చున్నయది.

పి. వే:—అయ్యో. గుఱ్ఱమును జంపిరి. అమ్మా! మనవారు కొద్దిగ నుండినను ధైర్యముగఁ బోరుచున్నారు. తురకల సైన్య మెంత యున్నదమ్మా. ఎందఱు చచ్చినను తరగనే తరగదు.

శ్రీరం:—బలే! తిమ్మానాయుఁడు గజమును ఖండించెను. అదిగదిగో నాన్న సైనికులను మట్టుఁ బెట్టు చున్నాఁడు.

పి. వే:—తురకలు పైకొని మనవారినిఁ గాల్చు చున్నారు. అయ్యో! ఇంకేమిగతి.

శ్రీరం:—కాదురా. చూడుము. మనవారే వారిని దఱుము చున్నారు.

వీ. వే:—ఔరా! కొట్టుడు కొట్టుడు. [అని మొఱఁబెట్టుచు] తురకలు పరుగెత్తిరి. ఔరా! మరలఁ దిరిగి మనవారినే నఱుకుచున్నారు. అమ్మా! వాఁడెవఁడే పొడుగు పాటివాఁడు.

వేంగ:—నాయనా! వాఁడే మిక్కిలి మహాస్త్రజ్ఞుఁడు. వానిని మీరుజుమ్మలా యందురు.

శ్రీరం:—అయ్యో! తిమ్మానాయునిఁ బట్టుకొనిరి. తెగెను. తెగెను. తిమ్మానాయుని తురగమును దెగ నఱికిరి.

వీ. వేం:—భయము లేదు. నాతండ్రి తిమ్మానాయునకు సహాయము రాఁబోవుచున్నాఁడు.

శ్రీరం:—అమ్మా! మా నాయనగారి గుఱ్ఱములన్నియు రక్తములోఁ దడిసి యున్నవి చూడుఁడు.

వీ. వేం:—పాపము తిమ్మానాయుని మీఁదికి సైనికులు గుంపులు గుంపులుగ వచ్చుచున్నారు చూడుఁడు.

శ్రీరం:—అయ్యో చంపిరి. తిమ్మానాయునిఁ జంపిరి. అమ్మా! తిమ్మానాయుని శిరము తెగిపడెను. చూడుము. అయ్యో! పాపము. ఇంకెట్లు.

వీ. వేం:—మీరుజుమ్మలా తండ్రివంక కేఁగుచున్నాఁడమ్మా.

శ్రీరంగ:—అయ్యో! నాతండ్రిగారొక్కరే పోరుచున్నారు. సైన్యములేదే. అకటా! గుఱ్ఱమును బరిమార్చిరి. తండ్రిగారు క్రిందినుండియే యుద్ధము చేయుచున్నారు. అమ్మా! నన్ను సహాయముగఁ బోనియ్యవే. (అని పోఁబోవును.)

వీ. వేం:—అయ్యో! తండ్రిగారిపైఁ బడిరి. మనము కూడఁ బోవుదమురారా. (అని శ్రీరంగరాయలను బిలుచును.

శ్రీరం:—నాయన పరుగెత్తి మనకోటకు వచ్చుచున్నారు.

వీ. వేం:—వచ్చెను. వచ్చెను. నాయన కోటను సమీపించెను.

ప్రవేశము:—తిరుమలరాయలు రక్తాంబరములతోఁ దొందరగ వచ్చును.

తిరుమ:—సఖీ! మన మిట నుండరాదు. తురకలు జయించిరి. మన మశ్వముల నెక్కి చంద్రగిరికిఁ బాఱి పోవుదము. దినములు బాగుపడిన పో మరల గొప్ప సైన్యమును గూర్చి గోలకొండ వారిని జయింప వచ్చును. ఆలస్యము చేయకుఁడు. (అని పిలుచుకొని పోవును.)

---

# పంచమరంగము.

---

ప్రవేశము:—మీరుజుమ్లాలా యుద్ధభూమి నుండి రక్త వస్త్రములతో ఖడ్గహస్తుఁడై తిరుమలరాయులను దరుముచు వచ్చినటుల నభినయించి గండికోటను బ్రవేశించును.

మీరు:—ఓరీ! క్షత్రియకులపాంసనా! నిలునిలు పాఱిపోకు.

కం॥ ఓరీ! రాజకులాధమా! తగునె నీ
కోర్వంగ మా శక్తినిన్
బోరంజాలక పాఱిపోయెదవునిన్
బోనిత్తునే యుద్ధరన్
కెరెంగాలముమీరు; దేశముమమున్
జెందెన్ వెసన్నేఁటికిన్
గ్రూరా! నిన్నిదె చెండి వేసెదను నా
కోపాగ్ని చల్లారఁగన్.

ఓరీ! పిఱికిపందా! తిరుమలరాయా! నిలునిలు (అని తొందరగాఁ బరుగిడనుంకించును.)

గులాబ్:—ప్రియా! నిలునిలుఁడు (అని చేతినిఁ బట్టి నిలుపును)

మీరు:—సఖీ! వదలుము. తిరుమలరాయులు తప్పించుకొని భార్యాసమేతుఁడై పోవుచున్నాఁడు. ఆలస్య మొనరించిన దొరకఁడు.

గులాబ్:—పోనిండు. మీ కేగకుఁడు.

మీరు:—నేఁ బోకపోయిన, ఆ ఖలుని శీర్షమును ఖండించి నీ కెటుల నర్పింపఁ గలను. అనిన మాటను దప్పుట నాకు సరియా.

గులాబ్:—మనోహరా! చాలును. వాని శిరస్సు నా కక్కర లేదు. వానికిఁ గావలసిన యవమానమైనది. నా కంతియ చాలును. (తిరుమలరాజు తలగుడ్డఁ జూపుచు) అతని తల మనకు లభింపక పోయినను, దానికి సరియగు వాని తల గుడ్డ దొరికినది. ఆ దుష్టుని తలఁ దఱిగిన మహాతల్లియగు వేంగళాంబ వైధవ్యమును వహింప వలసి వచ్చును. అది నా కిష్టములేదు. మీరు నా కతని శిరము నర్పింపఁ బని లేదు. నాకుఁ దృప్తియైనది. మీ సాహసమునకు మెచ్చితి. నా కోర్కె నెఱవేఱినది. గండికోటను జయించితిమి. మన కింకేమి కావలయు.

మీరు:—సరి. నీ యిష్టము. మన నవాబుగారింకను గండికోటఁ బ్రవేశింప లేదు. ఎక్కడ నున్నారో.

గులా:—అదిగో. వచ్చుచున్నారు. (అని ప్రక్కకుఁ బోవును.)

ప్రవేశము:—మహమ్మద్‌కులీ ఆదిల్‌షా తోడను, మంత్రిలోడను వచ్చును.

మ కు:—సెబాస్. సేనానీ! నీ ధైర్యసాహసములకు మెచ్చితిని తిరుమలరాజు తప్పించుకొని పోయెనా. పొలపాటువను దొందరలోను పెనుగొండను విడచి వచ్చితిమి. తిరుమలరాజు తప్పించుకొని పోయెను. వాఁడు మరల నేమి చేయునో. ఊఁ—ఏమిచేయును లెమ్ము.

ఆదిల్:—మీరుజుమ్లా. సఫలీకృతుఁడ వైతివి.

మంత్రి:—భలా! సేనానీ! అనిన ట్లొనరించితివి.

మీరు:—అన్నియు దైవానుగ్రహమునను, మీ యాశీర్వచన ప్రభావము వలనను నెఱవేఱినవి. నాదేమియు లేదు.

మ. కు:—నీ వీ కోటను జయించితివి. దీనికి నిన్నే సవాబుగాఁ జేయుకొనంటిని గదా? అటులనే యొనరించితిని. నీవు మా యధికారమునకు లోనై చక్కఁగఁ బాలింప వలయును.

మీరు:—మీ యాజ్ఞ శిరసా వహింతును.

మ. కు:—సేనానీ! రాజ్యపాలనము సులభము కాదు సుమా. దీక్షికిఁ దగిన భారమున్నది.

సీ॥ ప్రజలను బిడ్డల ♦ పగిదిఁ జూడఁగ వలె
   గూళిమై బాధింపఁ ♦ గోర రాదు
పూజ్యులౌ పెద్దలఁ ♦ బూజింపఁ గావలె
   బీదలపై బన్ను ♦ వేయ రాదు
నిర్బంధవిద్యను ♦ నేర్పింపఁ గావలె
   జారచోరుల మేలుఁ ♦ గోర రాదు

పనివాండ్రకెల్లను ♦ బరులఁ జూపఁగ వలెఁ
బక్షపాతముగల్గి ♦ బ్రతుక రాదు
తే॥ గీ॥ ఎవరి వృత్తుల వారికి ♦ నీవు వలయు
మాతృ భాషను నేర్పుట ♦ మానరాదు
నమ్మఁగూడని వారిని ♦ నమ్మ రాదు
రాజ్య తంత్రములకు నీడ ♦ రాదు సుమ్ము.

కనుక నీ యధీనమునకు లోనైన యీ గండికోట సీమను బహుబాగుగఁ బాలింపవలెను. నీవప్పుడప్పుడు నీ సీమ యందలి ప్రతిగ్రామమునకేగి న్యాయాన్యాయముల విచారింపవలయును. అనేక యోజనముల దూరమునఁ గూర్చుండి పరిపాలనా విధానమంతయు నితర యుద్యోగుల స్వాధీన మొనరించి; తాను వారి హస్తములలో జంత్రపు బొమ్మనావలెఁ జరించుచు, వారన్యాయము నొనరించినఁ దాను బ్రజలచే నిందింపఁబడు భూకాంతుని వలెఁగాక ప్రజారు రంజకుఁడవై యుండవలెను సుమా. "రాజ్యాంతే నరకం ధ్రువమ్ము"ను వచనముఁ మరువకుము.

మీరు:—చిత్తము.

మ. కు:—సేనాపి! ఇంకొకటి. ఇది హిందూరాజ్యము. ప్రజలందఱును హిందువులు. హిందువులన్న సామాన్యులు కారు. వారికి వ్యతిరేకముగ రాజ్య పాలన మొనరించిన వారు నిక్కొక యురనిముసమైన నిలువనీరు. జాగ్రత.

మీరు:—సర్కార్! అందులకు మీరు భయపడ వలదు. హిందువులలో మనకుండెడి మైకమత్యము నాస్తి. అట్టి వారిని జయించుట కడు సులభము.

మ. కు:—అదిగో. నీకీ దేశపు సంగతులు తెలియవు.

పోరిలో వారి పగఁబూని ♦ పోరుచుందు
పలుకు నిజమౌను సత్యమే ♦ పలికితివు
పగతుఁ డరుదెంచి వంతనే ♦ పగను మాని
కలిసి యుద్ధముఁ జేయఁగాఁ ♦ గలరు వారు.

కనుక హిందువులతోఁ బగఁ గల్పించుకొనకుము.

మీరు:—సరి. అటులనే యొనరించెదను.

మ. కు:—(ప్రక్కనుఁ జూచి గులాబ్‌మహల్‌ను జూపుచు ఈ యువతిమణి యీనాఁటికి ఇక్కడ నీ వెంట దిరుగుచున్న దేల?

మీరు:—ఆమె తనకోర్కె నెఱవేర్చు నన్నఁ గోరి నా వెంట నున్నది. ఇప్పటికి దానిని నెఱవేర్పఁ గలిగితిని.

మ. కు:—ఆమె. అవివాహిత యేనా?

మీరు:—అగును.

మ. కు:—(గులాబ్ మహల్‌తో) అమ్మాయీ! నీ మనోభీష్టమును దీర్చిన మా సేనాని యవివాహితుఁడే కనుక వీనికిఁ బరిణయము గావింపఁ గోరెదను. నీ వేమందువు.

గులాబ్:—(సిగ్గుతోఁ దలవంచుకొని చిఱునవ్వుతోఁ బలుకకుండును.)

ఆషిల్:—"మౌనమర్ధాంగీకారము" అను టెఱుంగరా?

మంత్రి:—అమ్మా! సమ్మతింపుము.

గులాబ్:—కానిండు.

మ. కు:—సేనానీ! నీ వేమందువు.

మీరా:—మీకు బదలాడుదునా అవశ్యము కానిండు.

మ. కు:—(ఆనందముతో) మన మిప్పుడొక వివాహము జరి
గించిన శాస్త్రముచేసి గోలకొండ కేగుదము. తర్వాత
మతాచారము ననుసరించి వారు వైభవముగా బరిణయ
ముం గావించు కొందురు. (అని యిరువురొకరి కొకరు నమస్క
రించి, పుష్పమాలను నిర్యాణగా నంగరించుకొని
కొని ఒకరి కొకరు పుష్పమాలను కంఠమున ధరించగా
నందఱుం గరతాళముల ధ్వని చేయుదురు.)

---

## భరతవాక్య

తే॥ గీ॥ సృష్టి లయ కారకుండగు ♦ స్రష్ట తాను
భారతావని జనులకుఁ ♦ బరుల బాధ
మాన్పి, స్వాతంత్ర్యమును గూర్చి ♦ భాగ్య మొసఁగి
కరుణ నారోగ్యము ల నిచ్చి ♦ కాచుఁ గాత!

ఇది పంచమాంకము.




Printed at the Janaki Printing Works, Proddutur. 1934.